# శ్రీ భగవద్గీత

## (ఆంధ్ర పద్యానువాదము)




:ర చ యి త:

బృందావనం రామకృష్ణమాచార్యులు

భాషాప్రవీణ



# శ్రీనివాసో విజయతే

"వృషభగిరిపతి కగుఁగాక విజయమెపుడు"

## -: కృతజ్ఞత :-

నా యీకృతి ముద్రణకు ఆర్థికసహాయమిచ్చి నన్నాదరించిన శ్రీతిరుమల తిరుపతి దేవస్థానమువారికి సర్వదాకృతజ్ఞుడను.

# వి న తి

నాయీ గీతానువాద కార్యమున నాకు సలహాలనిచ్చి చక్కనిదారిజూపి, వెన్నుదట్టి ధైర్యముగా నిలబెట్టిన సంస్కృ తాంధ్ర భాషాకోవిదులు పితృతుల్యులు, గురువులునైన శ్రీ నల్లాం వేంకటరత్నమాచార్యులుగారికి నా వినయాంజలులు.

# అ భి వం ద న ము

నాకు సమధికోత్సాహమునిచ్చి ఈ మహాకార్యమును నెం వేర్చుటకు తగిన యవకాశమును కల్పించి తోడుపడిన నా మాతృ సంస్థ శ్రీమతి సావిత్రీగణేష్ ఉన్నతపాఠశాల పాలకవర్గమునకు ఉపాధ్యాయ బృందమునకు నా గౌరవాభివందనములు.



# విషయ సూచిక

# ఆవరుఖము

శ్రీమాన్ నల్లూరి వెంకట రత్నమాచార్యులు

యం. ఎ. బి. ఇ. డి.

ఆంధ్రోపన్యాసకులు,
ఆంధ్ర జాతీయ కళాశాల,
మచలీపట్నం.

మంత్రహ్రదా త్కథాకుల్యా
విద్యా కేదార మాగతా
మోక్షశ్రియః ప్రసూర్మధ్యే
పీయతే కర్మమార్గగైః

మంత్రమన వేదము. వేదహ్రదము నుండి భారత కథాకుల్యా ప్రవహించినది. అది విద్యాకేదారమును తడిపినది. అందలి జలముచే మోక్షశ్రీ ఫలించినది. ఈ మార్గమున కర్మప్రధానుయాయి లందలి జలమును గ్రోలి తమ దప్పిని బాపుకొనుచున్నారు.

ఇట్లు శ్రీ వ్యాసవిరచిత మహాభారతము వేదధర్మ బద్ధమైనది. ప్రవృత్తి నివృత్తి మార్గ ప్రబోధమైనది. కర్మ జ్ఞాన నిష్ఠలకు సాధనమగుచున్నది.

ధర్మమును బోధించు శాస్త్రములు ధర్మశాస్త్రము లనబడు. శ్రుతి స్మృతి పురాణేతిహాసంబు లీతెగకు జెందును. శ్రుతు లపౌరుషేయంబులు. ప్రభుసమ్మితంబులు. శబ్దప్రధానములైనవి.

స్మృతులు మహర్షి ప్రోక్తంబులు. మన్వాది మహర్షులు లోకోద్ధరణకై వేదార్థంబులను మథించి స్మృతులను నిర్మించిరి. ప్రత్యక్షానుమానాగమ ప్రమాణంబులచే స్మృతులెల్ల ధర్మస్వరూపంబును బోధించును. పురాణాదులు మిత్రసమ్మితంబులు. అర్థ ప్రధానమైన మిత్రునివోలె ధర్మబోధ గావించును. మహాభారతము శ్రుతి స్మృతి పురాణేతిహాసములను జీర్ణించుకొన్న పవిత్రమైన గ్రంథము. "భారతం పంచమో వేదః," "సర్వ శ్రుతిసమూహార్యాయమ్" అని కీర్తింపబడినది.

నీలకంఠీయ టీక భారతరచనకు వేదమే మూలమని స్పష్టీకరించెను "భారతస్య మూలభూతా స్సంహితాః, మంత్ర బ్రాహ్మణ రూపా వేదాః" సంహిత అనగా మంత్ర బ్రాహ్మణ రూపములగు వేదములని యర్థము.

మహాభారతము యొక్క పవిత్రతను మార్కండేయ పురాణ మిట్లు కొనియాడుచున్నది.

త్రిదశానాం యథా విష్ణు
ద్విపదాం బ్రాహ్మణో యథా
భూషణానాం చ సర్వేషాం
యథా చూడామణిర్వరః॥
యథాఽఽయుధానాం కులిశ
మింద్రియాణాం యథా మనః
తథేహ సర్వశాస్త్రాణాం
మహాభారత ముత్తమమ్॥
ధర్మశాస్త్ర మిదం శ్రేష్ఠ

మర్థశాస్త్ర మిదం పరమ్
కామశాస్త్ర మిదం చాగ్ర్యం
మోక్షశాస్త్రం తథోత్తమమ్॥

భారతము పురుషార్థ సాధన కుపయుక్తమగు పవిత్రమైన గ్రంథము. ఇది వ్యాసుని మహాద్భుతసృష్టి వైజ్ఞానిక సంపదలకు పుట్టినిల్లు. సాంఘిక మర్యాదలకు సెలవు రాజకీయపు టెత్తుగడలకు నాటపట్టు. సారస్వత సంపదలకు సంస్థానము. అది వేయి పడగల శేషభోగి.

వ్యాసుడే భారత ప్రాశస్త్యమునిట్లు కొనియాడెను.

ఇదంతు త్రిషు లోకేషు
మహాజ్ఞానం ప్రతిష్ఠితం
విస్తరై శ్చ సమాసై శ్చ
ధార్యతే యద్ద్విజాతిభిః॥
అలంకృతం శుభైః శబ్దైః
సమయై ర్దివ్యమానుషైః
ఛందో వృత్తై శ్చ వివిధై
రన్వితం విదుషాం ప్రియాం॥
భూతం భవ్యం భవిష్యంచ
త్రివిధం కాల సంజ్ఞితమ్
జరా మృత్యు భయ వ్యాధి
భావాభావ వినిశ్చయః॥
వివిధస్య చ ధర్మస్య
హ్యాశ్రమాణాం చ లక్షణమ్

చాతుర్వర్ణ్య విధానంచ
పురాణానాం చ కృత్స్నశః॥
తపసో బ్రహ్మచర్యస్య
పృథివ్యా శ్చన్ద్ర సూర్యయోః
గ్రహ నక్షత్ర తారాణాం
ప్రమాణంచ యుగైః సహ॥
న్యాయ శిక్షా చికిత్సాచ
దానం పాశుపతం తథా॥
హేతు నైవ సమం జన్మ
దివ్య మానుష సంజ్ఞితం
తీర్థానాం చ పుణ్యానాం
దేశానాం చైవ కీర్తనం॥
నదీనాం పర్వతానాం చ
వనానాం సాగరస్య చ
పురాణాం చైవ దివ్యానాం
కల్పానాం యుద్ధకౌశలం॥
వాక్యజాతి విశేషాశ్చ
లోకయాత్రా క్రమశ్చయః
యచ్చాపి సర్వగం వస్తు
తచ్చైవ ప్రతిపాదితం॥

మహాభారతము త్రిలోక విజ్ఞాన విలసితంబు. ఇది శుభశబ్ద శోభితంబై వివిధ ఛందో వృత్త విలసితంబై విజ్ఞులగు విప్రుల కత్యంత ప్రియమైనది. భూత భవిష్య ద్వర్తమాన కాలముల స్వరూ

స్వభావము లిందు వర్ణింపబడియె. జీవులకు సంభవించు జరా మృత్యు భయ వ్యాధులకు గల హేతువులు వివరింపబడియె. వర్ణాశ్రమ ధర్మములు, అనుష్ఠాన వైఖరులు చక్కగా చర్చింపబడియె. పుణ్యతీర్థముల మహిమలు కొనియాడబడియె. భౌగోళిక శాస్త్ర మింపు గోచరించు. నగర దుర్గ నిర్మాణ నైపుణ్యము, యుద్ధకౌశలంబు, లోకయాత్రా క్రమంబు, వాక్య జాతి విశేషంబులు భారత రచనకు వన్నెదెచ్చెను.

ఇట్టి పవిత్ర మహాభారతములో వ్యాసుడు ధర్మాధర్మ వృక్షములను నాటెను. వాని స్వరూప వైఖరు లిట్లు వర్ణింపబడియె.

(i) యుధిష్ఠిరో ధర్మమయో మహాద్రుమః
స్కంధోర్జునో భీమసేనోఽస్య శాఖాః
మాద్రీసుతౌ పుష్పఫలే సమృద్ధే
మూలం కృష్ణో బ్రహ్మ చ బ్రాహ్మణాశ్చ॥

(ii) దుర్యోధనో మన్యుమయో మహాద్రుమః
స్కంధః కర్ణ శ్శకుని స్తస్య శాఖాః
దుశ్శాసనః పుష్పఫలే సమృద్ధే
మూలం రాజా ధృతరాష్ట్రో ఽమనీషీ॥

“ధర్మజుండు ధర్మవృక్షము అర్జునుఁ డద్దాని స్కంధము. భీముఁడు శాఖలు నకులసహదేవులు పుష్పఫలములు. శ్రీ కృష్ణ పరమాత్మ, వేదము, బ్రాహ్మణులు -ఈ ధర్మవృక్షమునకువేళ్లు.

దుర్యోధనుఁ డధర్మ వృక్షము కర్ణుఁ డద్దాని స్కంధము. శకుని దాని శాఖలు. దుశ్శాసనుండు పుష్పఫలములు. అజ్ఞుడగు ధృతరాష్ట్రుఁడే ఈ మహావృక్షమునకు మూలము,

ఇట్టి మహాభారతమున గీతాశాస్త్రము భీష్మపర్వములో నిమిడి యున్నది. ఈ గీతాశాస్త్రము బ్రహ్మవిద్యను బోధించును. ఉపనిషత్సారము. ఉత్తమ యోగశాస్త్రము. ప్రవృత్తి నివృత్తి మార్గ సంథాయిని. ప్రస్థానత్రయ శిరోభూషణము. చిత్తశాంతి కిది నెలవు తత్త్వజిజ్ఞాసువుల కిది ముంజేతి కంకణము; ఈ పవిత్ర గీతామృతమును గ్రోలి తరించిన మహనీయు లెందరో గలరు. దీని నను గ్రహించిన వాఁడు సాక్షాత్ నారాయణ స్వరూపుఁడగు శ్రీకృష్ణపరమాత్మయే. గ్రహించినవాఁడు నరుఁడు. నరనారాయణ సంవాద రూపమగు గీతామకరందమును జీవులకుఁ జవిజూపించినవాఁడు వ్యాసభగవానుఁడు. దీని ఘనతను వైష్ణవీయ తంత్రసార మిట్లు నుడువుచున్నది.

సర్వోపనిషదో గావో
దోగ్ధా గోపాలనందనః
పార్థో వత్సః సుధీర్భోక్తా
దుగ్ధమ్ గీతామృతమ్ మహత్॥

ఉపనిషత్తులు గోవులు.
గోపాలనందనుఁడు దోగ్ధ. పార్థుఁడు గోవత్సము, విజ్ఞులు భోక్తలు. గీతామృతము జ్ఞానపుష్టి నొసంగు దుగ్ధము.
శంకరభగవత్పాదులు "శోక మోహ సంసార కర్మ నివృత్త్యర్థమ్ గీతాశాస్త్రమ్, న ప్రవర్తకమ్" అని నుడవిరి. శోక మోహ సంసార కర్మ నివృత్తిని గావించుటయే గీతాశాస్త్రము యొక్క ప్రయోజనము. అది జీవుని కర్మబంధ విముక్తుని గావించును. కర్మప్రవర్తక మొనరింపదు.

**J. W. Hauer** అను జర్మనుదేశ పండితుఁడు "జీవితసత్యమును వివరించు శాశ్వతమైన గ్రంధము గీతాశాస్త్రము" అనినుడివెను.

" We are not called to solve the meaning of Life But to find out the deed demanded of us and to work and so, By action, to master the riddle of Life "
గాంధీ మహాత్ముఁడు గీతాశాస్త్ర వ్రన ప్రయోజనము నిట్లు వివరించెను.

" From that time till now: the last nineteen stanzas of Chapter II have ever remained engr aved in my heart. For me, they Contain the essence of Dharma. They embody the highest Knowledge. The Principles enunciated in them are immutable. The intellect, too, is active in them in the highest degree, But it is intellect disciplined to high Purpose. The Knowledge. Which they contain is the fruit of experience"

గీతాశాస్త్రము బ్రహ్మవిద్యాన్తర్గతమగు కర్మయోగశాస్త్రము. బ్రహ్మవిద్యయన ఆత్మవిద్య అదిఆత్మతత్త్వమునుబోధించును:ఆత్మ నశించదు. దేహములెల్ల నశించును."శీర్యతే ఇతి శరీరమ్" శరీర మనగా నశించునట్టిది. ఇట్లు నశించు శరీరమునకును ఆత్మకును గల సంబంధము గీతాశాస్త్రము వివరించుచున్నది. ఆత్మానాత్మ వివేచనము జీవుల కత్యంతావశ్యకమైనది. భారతీయు లాత్మజ్ఞా నాన్వేషణమే పరమార్థముగా భావించిరి. భారతములో శాంతి పర్వమున -ఆచార్యుఁడు శిష్యునకిట్లు బోధించును.

కిం తే ధనేన? కిము బంధుభి రేవవా తే?
కిం తే దారైః పుత్రకః యో మరిష్యసి
ఆత్మాన మన్విచ్ఛ గుహాం ప్రవిష్టమ్
పితామహాస్తే క్వా గతాః పితాచ."

"బిడ్డా! ధనము వలన నేమి ప్రయోజనము? బంధువుల వలన కలుగు లాభమేట్టిది? భార్య వలన పొందు సుఖమేమి? వారెల్లరు నశించువారే! ఆత్మజ్ఞానము నన్వేషింపుము, నీ తండ్రియు, తాతయు గతించిరికదా!'' అనిఆత్మ జ్ఞానాన్వేషణము నకు ప్రోత్సాహించును.

భర్తృహరి వైరాగ్యశతకములో మన దేహస్థితినితెల్పుచు, "గాత్రం సంకుచితం, గతిర్విగళితా, భ్రష్టాచ దన్తావలి, దృష్టిర్నశ్యతి, వర్ధతే బధిరతా, వక్త్రంచ లాలాయతే, వాక్యం నాద్రియతేచ బాంధవజనో, భార్యా న శుశ్రూషతే హా! కష్టం పురుషస్య జీర్ణవయసః, పుత్రోప్య మిత్రాయతే" శరీరము ముడుతలు పడును. నడక మందగించును. దంతము లూడిపోవును, చూపు నశించును చెవుడా|శయించును. నోర చొంగ కారును. బంధువులు మాట వినరు. భార్య సేవ చేయదు. తాను గన్న పుత్రులు సైతము శత్రులగుదురు. ముదిసిన వానికష్ట మేమన వచ్చును!'' జరామరణముల కాలవాలమగు ఈ దేహమునకు వైరాగ్యమే శరణ్యమని తెల్పుచు ఇట్లు వచించెను.

భోగే రోగభయం, కులే చ్యుతిభయం, విత్తే నృపాలాద్భయం
మానేదైన్యభయం, బలే రిపుభయం, రూపే జరాయా భయం
శాస్త్రే వాదభయం, గుణే ఖలభయం, కాయే కృతాన్తా ద్భయం,
సర్వం వస్తు భయాన్వితం, భువి నృణాం వైరాగ్యమేవా భయమ్"

భోగమునందు రోగభయమును, కులమునందు చ్యుతిభయమును, విత్తమునందు రాజభయమును, మానమునందు దైన్యభయమును, బలమునందు రిపుభయమును, రూపమునందు జరాభయమును, శాస్త్రమునందు వాదభయమును, గుణమునందు

బలభయము:ను, కాయమునందు కృతాన్తభయమును కలుగును. సర్వ వస్తుచయంబును భయాన్వితంబు గాన నరులకు వైరాగ్యమే శరణ్యమని'' భర్తృహరి నుడివెను. ఇట్టి వైరాగ్య భావము గీతాశాస్త్రముచే లభించును.

గీతాశాస్త్రము ధర్మశబ్దముతో ప్రారంభమగుచున్నది. అభ్యుదయ నిశ్శ్రేయసమ్సులకు హేతువైనది ధర్మ మనంబడు. ఈధర్మ శబ్దము గీతలో పలుమారులు పలుతావులలో ప్రయోగింపబడినది. ధర్మ సంస్థాపనయే గీతయొక్క ముఖ్య ప్రయోజనము. శ్రీకృష్ణ భగవానుఁడు ధర్మసంస్థాపనార్థమే తానవతరించినట్లు నుడివెను.

(i) పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం
ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే॥

(ii) యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత!
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్॥

వేదధర్మము వర్ణాశ్రమబద్ధంబు. దీని నాచరించుటకు తానే రెండు మార్గములను సెలకొల్పితినని భగవానుఁడు వచించెను.

లోకేస్మిన్ ద్వివిధా నిష్టా పురా ప్రోక్తా మయానఘ,
జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినాన్॥

జీవులు తరించుటకు లోకములో రెండే మార్గములు గలవు

అం దొకటి జ్ఞానయోగము, The Path of Knowledge) రెండవది కర్మయోగము (The Path of action). భక్తి వానికంగమై భాసించును (The Path of devotion). అది యుపాసన మనంబడు. ఈ రెండు మార్గములు తత్త్వ జిజ్ఞాసువులకే గోచరించును.

తత్త్వ మనగా తత్, త్వమ్ పదముల కూటమి. తత్ విషయి. అది అస్మత్ప్రత్యయ గోచరము. కేవలము జ్ఞానస్వరూపము. ఈ

జ్ఞానప్రకాశము సూర్యకాంతివలె సర్వమును భాసింప జేయును. అట్లు చేయుట దాని స్వభావము. సూర్యకాంతికి లోక వ్యవహారముతో నెటుల సంబంధము లేదో, అటులనే విషయికి గూడలోక వ్యవహారముతో సంబంధము లేదు. విషయి సాక్షిమాత్రుఁడు. అతఁడు లోక వ్యవహారమునకు కర్త గాఁడు. కనుక తత్ఫల భోక్త గూడ కాడు. సర్వవ్యాపి. కర్తృత్వ భోక్తృత్వములు లేనివాఁడు. అతని సాక్షిత్వమునకు లోనగున దంతయు అన్యకర్తృకము.

అతని కంటె భిన్నమయినది విషయ మనంబడు. అదియే త్వమ్ పదార్థము. అది యుష్మత్ ప్రత్యయ గోచరము, విషయి (తత్) ని, ఆత్మ యనియు, విషయమును అనాత్మ (త్వమ్) యనియు పిలుతురు, సత్య జ్ఞానానందములు విషయి ధర్మములు స్థూల కృశత్వాదులు దేహధర్మములు. వచనాదాన గమన విసర్గాదులు ఇంద్రియ ధర్మములు కామ విచికిత్సాదులు మనోధర్మములు, "నేను" అనెడు జ్ఞానము అహంతాధర్మము, ఇవి యన్నియు విషయధర్మములు, విషయి విషయము లాత్మానాత్మలు, అస్మదుష్మత్ ప్రత్యయ గోచరములు, ప్రత్యయమన ప్రసిద్ధమగు జ్ఞానము, గోచరమన స్ఫురించు నర్థము, అస్మత్ ప్రత్యయ గోచరమన అస్మత్ అను పదము వినినప్పుడు కలుగు జ్ఞానము నందు విషయ మగునది యని యర్థము, అది సర్వసాక్షియగు విషయి లేక ఆత్మ. ఆత్మ అస్మత్ అను పదమునకర్థము గాదు. అది ఆ పదము యొక్క అర్థముచే సూచింపబడును, ఆత్మ శబ్దమునకు పలువురు పలువిధములుగా వ్యాఖ్యానము గావించిరి. దేహ మాత్మయను వారు కొందఱు, మనస్సాత్మ యనువారు కొందఱు, ప్రాణమాత్మ యనువారు కొందఱు గలరు. ఎవరికి వారు వారి సిద్ధాంతములను వెలిబుచ్చిరి,

గీతలో పదునెనిమిది యధ్యాయములు గలవు. అందు మొదటి యారధ్యాయములును యుష్మత్ ప్రత్యయ గోచరమగు

విషయస్వరూపము నెఱిగించును, అనగా అనాత్మ స్వరూపమును తెల్పును. దీనినే త్వం పదార్థచింతన మందురు. అర్జునుఁడు శోకమోహముల నాశ్రయింప భగవానుఁ డాతనికి త్వం పదార్థస్వరూపమును బోధించెను,

తదుపరి (రెండవ) యారధ్యాయములును అ స్మత్ప్రత్యయ గోచరమగు విషయి (ఆత్మ) స్వరూపమును బోధించును. అనగా "తత్పదార్థ" చింతనమును గావించును, తుది యారధ్యాయము లును తత్ (ఆత) త్వమ్ (అనాత్మ) లకు గల సంబంధమును బోధించును. దీనినే తత్త్వమని పిలుతురు, తత్త్వమును బోధించు శాస్త్రము తత్త్వశాస్త్రము. ఇట్టి తత్త్వశాస్త్రమే గీతాశాస్త్రము, దీని నెఱింగిన వాఁడే తాత్త్వికుఁడు, అతఁడే వేదాంతి, అతండే పండితుఁడు.

పండిత శబ్దము పండా శబ్దజనితము. "పండా ఆత్మవిషయా బుద్ధిః ఏషాంతే పండితాః" ఆత్మవిషయు బుద్ధి గలవాఁడే పండితుఁడు. కేవలము లౌకిక విద్య గలవాఁడు పండితుఁడు గాఁడు "పాండిత్యం నిర్విద్య" అని బృహదారణ్యకము నుడువుచున్నది.

యస్యా మతం తస్య మతం
మతం యస్య నవేదసః
అవిజ్ఞాతం విజనతాం
విజ్ఞాత మవిజానతామ్ అని

అని కేనోపనిషత్తు నుడువుచున్నది.

"బ్రహ్మము చక్షురాదింద్రియములకు గోచరింపదు. మనస్సున నెఱుకబడదు. మనోనేత్రంబులకు బాహ్యవిషయములే గోచరించును

"యథా చక్షుషా పశ్యతి, తథామనసా విజానాతి" నేత్రముతో నెట్లుచూచునో మనస్సుతో నట్లే విశేషముగా నెఱుఁగును. అని వాత్స్యాయనుఁడు నుడివినాడు. రూపాదులు బ్రహ్మమునకు

లేనందువ చక్షువుల కది యందదు. మనస్సున కది విషయము కాజాలదు. "న తత్ర చక్షుర్గచ్ఛతి. న మనో గచ్ఛతి'' అని కేనోపనిషత్తు వచించు చున్నది. కాన మనస్సుతో బ్రహ్మము తెలియబడునని యెంచువాఁడు బ్రహ్మము నెఱుంగజాలడు.

అట్టి బ్రహ్మము పండితులకే గోచరమగునే. సదా పశ్యంతి సూరయః అని ఉపనిషద్వాక్యము బోధించుచున్నది. గీతాశాస్త్రము కూడ ఈ విషయమునే దృఢపరచుచున్నది.

యానిశా సర్వభూతానాం
తస్యాం జగర్తి సంయమీ
యస్యాం జాగ్రతి భూతాని
సానిశా పశ్యతో మునేః॥

ఎల్ల భూతములకు రాత్రియైనది సంయమికి పగలగును. రాత్రియన మనకగోచరమగు పరమాత్మ యని యర్థము. పగలనగా గోచరమగు పరమాత్మ యని యర్థము. అనగా అజ్ఞులకు రేయిగా కాన్పించు పరమాత్మ సంయమికి వెలుగుగా భాసించును. అటులనే భూతములకు గోచరమగు సామాన్యమగు వెలుఁగు (జాగ్రతి-జగత్తు) మునులకు నిశగా కాన్పించును, అనగా పండితులగు మునులే పరమబ్రహ్మను గాంచగలరనియు, ఇతరుల కది సాధ్యము కాదనియు భావము.

అట్టి పండితుఁడు శోకింపదగని వారికై శోకింపడు ప్రజ్ఞావాదమును గావింపడు. వర్తమానంబునకు క్రుంగడు. అట్టి వాడే పండితుఁడు. ఇది శ్రీ కృష్ణభగవానుని నిర్ణయము.

అశోచ్యా నన్వశోచ స్త్వం
ప్రజ్ఞావాదాంశ్చ భాషసే
గతాసూ నగతాసూంశ్చ
నానుశోచన్తి పండితాః॥

అతని ఘనత కొనియాడ దగినది. సమధర్మనత్వ మాతని సంపద.

విద్యా వినయ సంపన్నే
బ్రాహ్మణే గవి హస్తిని
శుని చైవ శ్వపాకేచ
పణ్డితాః సమదర్శినః॥

విద్యా వినయ సంపన్నుఁడగు బ్రాహ్మణుని యందును, గవి యందును, కరి యందును, శుని యందును, శ్వపకుని యందును, పరమాత్మను తిలకించగల సమదృష్టిని పండితుఁడు కలిగి యుండును.

యస్య సర్వే సమారమ్భాః
కామ సంకల్ప వర్జితాః
జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణాం
తమాహుః పణ్డితం బుధాః॥

అట్టి పండితుఁడు కామ సంకల్ప వర్జితుఁడు. జ్ఞానాగ్ని దగ్ధ కర్మ పరాయణుఁడు. అట్టి మహామహుని జ్ఞానము బ్రహ్మజ్ఞానము. అట్టి వారు"నానుశోచన్తి" యను మార్గము ననుసరింతురు.

కాన బ్రహ్మము మనస్సునకు విషయముగాదు. అది ధ్యానాదుల మూలమగు బుద్ధికి మాత్రము గ్రాహ్య మగునని గీతాశాస్త్రము నుడువుచున్నది.

దృశ్యమాన ప్రపంచము విచిత్రమైనది. అది నేనని భావించిన జీవి సత్య దూరుఁడగును సత్యము తనకన్న వేరైనది గాదు, అది సూక్ష్మాతి సూక్ష్మము. సత్యాన్వేషణమున కంతరింద్రి యమే సాధనము. అంతరంగమున కధిష్ఠానము దేహము, దేహము గలది దేహి. దేహము నశించును. దేహి నశింపదు, అది దేహాంతర ప్రాప్తిని బడయును. ఈ దేహమునకే క్షేత్రమనియు, శరీరమనియు పేర్లు గలవు. "ఇదం శరీరం కౌన్తేయ! క్షేత్ర

మిత్యభిధీయతే" అని గీతాచార్యుని నిర్వచనము. అందుచే జీవుఁడీ క్షేత్రమును ధర్మక్షేత్రము గావింప వలయును. అదియే శ్రీ కృష్ణభగవానుని నిర్ణయము. మానవుఁడు ధర్మ భ్రష్టుఁడు కాగూడదు. ధర్మము కర్మచే బడయగలఁడు, కర్మమన వేదోక్త కర్మమని భావము. అట్టి నియతకర్మను బాసి, ధర్మసమ్మూఢ చేతస్కుఁడైన నరునకు నారాయణుఁ డుపదేశమొనరించి కర్తవ్యోన్ముఖుని గావించెను. ప్రవృత్తిని బడయుటయే మన కర్తవ్యము దీనికి నాంతరంగిక చతుష్టయమును సంస్కరింపవ లయును. ఇట్టి యత్నమే తపస్సనంబడును. భగవానుఁడీ తపస్సును శారీరక, వాఙ్మయ, మానసిక భేదంబుచే త్రివిధంబు లని వచించెను.

"దేవ ద్విజ గురు ప్రాజ్ఞ పూజనం, శౌచమార్జవం బ్రహ్మచర్య మహింసా చ శారీరం తప ఉచ్యతే॥" దేవ ద్విజ గురు ప్రాజ్ఞ పూజనము, శౌచము (శారీరక మానసినములు) ఆర్జవము (సమచిత్తతా), బ్రహ్మచర్యము,

అహింసా (దయా భూత హితైషిత్వం) అను శారీరక ధర్మ నిర్వహణమే శారీరకమగు తపస్సనంబడు.

ఇక వాఙ్మయతప ముత్కృష్టమైనది. ఇది రెండవ యంతస్థు.

"అనుద్వేగకరం వాక్యం
సత్యం ప్రియ హితంచ యత్
స్వాధ్యాయా భ్యసనం చైవ
వాఙ్మయం తప ఉచ్యతే"॥

అనుద్వేగకరము, ప్రియహితము, సత్యమును గల సంభాషణము, స్వాధ్యాయాభ్యసనము వాఙ్మయ తప మనఁబడును. అందుచే స్మృతి కారుఁడగు మనువు సైతము.

సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయాత్
న బ్రూయాత్ సత్య మప్రియమ్
ప్రియంచ నానృతం బ్రూయాత్
ఏషధర్మః సనాతనః" అని వాక్రుచ్చెను.

పిమ్మట మహాత్మ్యకృష్టమగు మానసిక తపము శ్రేయో

దాయకము!

"మనః ప్రసాదః సౌమ్యత్వం
మౌన మాత్మ వినిగ్రహః
భావ సంశుద్ధి రిత్యేత త్తపో
మానస ముచ్యతే॥

మానసిక ప్రసన్నత; సౌమ్యత్వము (శాంతభావము), మౌనము ఆత్మ వినిగ్రహము, మనోనిగ్రహము, భావసంశుద్ధి (అంతఃకరణ పవిత్రత) కలిగి యుండుట మానసిక తపమని భగవానుని యాశయము.

ఇట్టి తపస్సాధనకు శ్రద్ధ (Faith) ముఖ్యావసరము. శ్రద్ధయా దేయమ్, అశ్రద్ధయా దేయమ్ అని ఉపనిషద్వచనము. భగవానుడు కూడ గీతాశాస్త్రమున

శ్రద్ధావాన్ లభతే జ్ఞానం
తత్పరః సంయతేన్ద్రియః
జ్ఞానం లబ్ధ్వా పరాం శాన్తి
మచిరే ణాధిగచ్ఛతి అని సెలవిచ్చెను,

జితేంద్రియుండును, తత్పరుండును నగుశ్రద్ధగల పురుషునకు మాత్రమే జ్ఞానము లభ్యపడును. అట్టి జ్ఞానమును బడసిన వాఁడే పరమశాంతిని బొందగలడు.

గీతాశాస్త్రము జీవేశ్వర సంబంధమును వివరించును. జీవుఁడు నిత్యుఁడు ఇరువురును అది లేనివారే! ఈ సంబంధ మిరువురకును గలదు. జీవుఁడు జనన మరణ పరంపరలో తిరుగుచున్న వాఁడు. కర్మ ఫలములగు సుఖదుఃఖానుభవములతో, కర్తృ భోక్తృ లక్షణ ములతో, అనగా "అహం కర్తా, అహం భోక్తా అను భావనతో దేహాది ఇంద్రియ సంయుతమును- నేను అను బుద్ధితో జీవుఁడు తిరుగుచున్నాఁడు.

పరమేశ్వరుఁ డెప్పుడును విలక్షణుఁడే. విజ్ఞాన యోగములో శ్రీకృష్ణ పరమాత్మ

> నాహం ప్రకాశః సర్వస్య
> యోగ మాయా సమావృతః
> మూఢోయం నాభిజానాతి
> లోకో మామజ మవ్యయమ్॥

యోగమాయచే బాగుగా కప్పబడి యుండుటచే నే నెల్లరకును గోచరించు వాడను గాను. అజ్ఞులగు జనులు నన్ను జన్మరహితుని గను, నాశరహితునిగను ఎఱుంగరు అని తెల్పెను.

జీవులకు భోగ్యమయిన పదార్థము ప్రపంచము. ప్రపంచము జీవమయము. జీవులు భోక్తలు. అనగా కర్మఫలము ననుభవించు వారు ఈ ప్రపంచము భోక్తలతోను, భోగ్య పదార్థములతోను కూడియున్నది. ఈ జీవలక్షణము దేవతలకు గూడ వర్తించును. దేవ తిర్యక్కు నాగ పశు పక్ష్యాదులకును జీవలక్షణము గలదు. ఇది యంతయు కర్మాధీనము. వీరందఱు కర్మాధీనలే! పరమేశ్వరుఁ డెప్పుడును వీరికంటె విలక్షణుఁడు. ఈ లక్షణములు లేనివాఁడు. సర్వ శక్తిమంతుఁడు. జీవులకు వారు కోరు భోగ్య పదార్థములను భోగ జన్మలను ఉచిత కాలములో వారికి ప్రసాదించువాఁడు. కర్మఫల ప్రదాత. ఈజన్మలు నే నిచ్చుచున్నానని -శ్రీకృష్ణ భగ

వానుఁడు 16వ అధ్యాయమున దైవాసుర సంపద్విభాగ యోగ ములో చెప్పుచున్నాడు.

> తానహం ద్విషతః క్రూరాన్
> సంసారేషు నరాధమాన్
> క్షిపామ్యజస్ర మశుభా
> నాసురీష్వేవ యోనిషు॥

సర్వ ప్రాణుల కాత్మయగు నన్ను ద్వేషించు వారును, అశుభ కృత్యములొనరించు వారును, అగు నరాధములను నేను జనన మరణ రూపములగు ఈ సంసార మార్గములందును, అసుర సంబం ధమైన నీచ జన్మలందును త్రోసివై చెదను.

జీవేశ్వరులు నిత్యులైనను, జీవుఁడు మాత్రము జనన మరణ ప్రవాహములలో తిరుగుచుండును. జీవులు కర్మాధీనులు. దీనినే సంసారము లేక సంసరణ మందురు. జన్మను మనము కోరనిదే పరమేశ్వరుఁ డొసంగఁడు. కోరిననే జన్మ నొసంగును. కోరిన వెంటనే ఫలించునా? తరువాత కొంత కాలమునకు ఫలిం చునా? అనునది పరమేశ్వరాధీనము.

మనకు ఆయా జన్మలు ఎట్లు వచ్చుచున్నవో నిరూపించుచు భగవానుఁడు గీతలో "అహం క్షిపామి- నేను పడవైచెదను'' అని చెప్పినాఁడు.

అవిద్యా కామహేతువులకు ఫలమైనది కర్మము. కర్మలే జన్మలకు కారణము. జీవులకు మూఁడు నరకద్వారములు గలవు. దైవాసుర సంపద్విభాగ యోగములో భగవానుఁడు

> త్రివిధం నరకస్యేదం
> ద్వారం నాశన మాత్మనః
> కామః క్రోధ స్తథాలోభ
> స్తస్మా దేతత్త్రయం త్యజేత్॥

కామము, క్రోధము, లోభము -అను మూడును నరకద్వారములు. ఇవి జీవునకు నాశనము కలుగజేయును -కాన వీనిని విడనాడవలెను ఇవి మూడును పరమ శత్రువులని" వచించెను.

రజోగుణము వలన కామము పుట్టును. ఇదియే క్రోధముగా పరిణమించును ఎంత అనుభవించినను ఈ కామము తృప్తిని బొందదు. ఇది మహాపాపములకు కారణభూత మయినది. ఇది మోక్షమునకు పరమశత్రువు. మోక్షమును కాంక్షించు వాఁడు కామక్రోధములను విడువవలయును. కామక్రోధములు చిత్తములో వేళ్లు పాదుకొనియున్నవి. వేళ్ళే కాదు, ఊడలు గూడ దిగియున్నవి. వీనిని "అసంగ శస్త్రేణ దృఢేన ఛిత్వా" అన్నట్లు దృఢమగు అసంగశస్త్రముచే మొదలంట నరుకవలెను.

ఈ కామక్రోధాదులు తమోగుణములు. వీనిని వదలిననే జీవుఁడు బాగుపడును. అంత మాత్రముననే మోక్షసిద్ధి కలుగదు. శ్రేయములగు కార్యముల నాచరించవలెను. పిమ్మట నరుఁడు శాంతిని లేక మోక్షమును పొందగలడు.

గీతాశాస్త్ర మాత్మానాత్మ వివేక విజ్ఞానబోధకము. ఆత్మానాత్మ స్వరూప స్వభావములను వివరించి జీవుల శోకమోహాది సంసార బీజభూత దోషోద్భవ హేతువులను నివారించును.

ఆదిశంకరు లాత్మానాత్మ వివేచనము నిట్లు ప్రశంసించిరి.

1) జన్తూనాం నరజన్మ దుర్లభ మతః
పుంస్త్వం తతో విప్రతా
తస్మా ద్వైదిక ధర్మమార్గ పరతా
విద్వత్త్వ మస్మాత్పరమ్॥

2) ఆత్మానాత్మ వివేచనం స్వనుభవో
బ్రహ్మాత్మనా సంస్థితిః

ముక్తిర్నో శతకోటి జన్మ సుకృతైః
పుణ్యై ర్వినా లభ్యతే ॥

జంతువులలో నరజన్మ దుర్లభము. అందును పురుషత్వము లభించుట మిక్కిలి కష్టము. పురుషత్వముకన్న విప్రత్వము శ్రేష్ఠము. విప్రత్వముకన్న వైదిక ధర్మమార్గ పరత్వము శ్రేష్ఠతరము. వైదిక ధర్మమార్గ పరత్వముకన్న విద్వత్త్వము శ్రేష్ఠతమము. ఇవి గలిగియు; ఆత్మానాత్మ వివేకము, సమ్యగనుభవము, బ్రహ్మభావనాస్థితి; ముక్తి - అనునవి శత కోటి జన్మ సుకృత పుణ్యవిశేషము లేక జీవునకు సిద్ధింపవు.

దృశ్యమానమగు జగత్తులోని సర్వపదార్థములు షడ్భావ వికారములను పొందును. అవియన్నియు అనాత్మపదార్థములే.

1) జాయతే (పుట్టుట) 2) అస్తి (ఉండుట)
3) వర్ధతే (పెరుగుట) 4) విపరిణమతే (మారుట)
5) అపక్షీయతే (క్షీణించుట) 6) నశ్యతే (నశించుట)

అను వికారము లారును ఆత్మకు లేవు.

ఆత్మతత్త్వమును పలువురు పలుగతుల పరిశోధించిరి.

కొందరు దేహమే ఆత్మయనిరి. వీరిని దేహాత్మవాదు లందురు. వీరు నాస్తికులు. వీరిలో చార్వాకులు మిక్కిలి ప్రాచీనులు. వారి మతానుసారము -

(1) ప్రత్యక్షమేవ ప్రమాణమ్-ప్రత్యక్షానుభవమే ప్రమాణము.
(2) నాస్తి పరలోకః -పరలోక మనునది లేదు
(3) మృత్యు రేవాపవర్గః -మృత్యువే మోక్షము.
(4) అర్థకామౌ పురుషార్థౌ- అర్థకామములే పురుషార్థములు.
(5) పృథివ్యప్తేజో వాయవ స్తత్త్వాని -పృథివి, అప్, తేజస్సు, వాయువు అను నాలుగే తత్త్వములు.

(6) శరీరేంద్రియ సంఘాతముచే నేర్పడిన చైతన్యమే క్షేత్రజ్ఞుఁడు.

(7) యావజ్జీవం సుఖం జీవేత్
ఋణం కృత్వా ఘృతం పిబేత్
భస్మీభూతస్య దేహస్య
పునరాగమనం కుతః

బ్రదికినంతకాలము సుఖముగా జీవించుము. ఋణము జేసి నేతిని త్రాగుము. భస్మీభూత మయిన దేహమునకు పునరాగమన మెక్కడిది?

(8) అగ్నిహోత్రం త్రయోవేదాః
త్రిదండం భస్మగుంఠనమ్
బుద్ధి పౌరుషహీనానాం
జీవికా ధాతృనిర్మితా॥

అగ్నిహోత్రము; వేదత్రయము; త్రిదండ సన్యాసము; భస్మధారణము- అనునవి బుద్ధిపౌరుషహీనులు జీవించుటకై విధాతచే కృత్రిమముగా కల్పింపబడినవి గాని యధార్థములు గావు.

ఇట్టి చార్వాకుల నాస్తికవాదమును కాలాత్మవాదులు ఖండించి తమ సిద్ధాంతము నిట్లు వివరించిరి.

1 అస్తి జీవః స్వతోనిత్యః కాలతః
2 కాలవానశ్చ నామ తే మన్త్వా కాల
కృతమేవ జగత్సర్వం మన్యన్తే- తథాచ
తేప్రాహుః -న కాల మన్తరేణ చంపకా
శోక సహకారాది వనస్పతి కుసుమోద్గమ
ఫలబంధాదయో హిమకరుణానుషక్త శీతప్రపాత

నక్షత్ర చార గర్భాధాన వర్షాదయో వర్తు విభాగ సంపాదితా బాల కుమార యౌవన వలీ పలితా గమాదయో హ్యవస్థావిశేషా ఘటన్తే, ప్రతి నియత కాలవిభాగత ఏవ తేషా ముపలభ్య మానత్వాత్ ।  అన్యథా సర్వ మవ్యవస్థతయా భవేత్। న చైతద్దృష్టమిష్టం వా। అపిచ ముద్గ పంక్తిరపి న కాలమ న్తరేణ లోకో భవన్తీ దృశ్య తే. కింతు కాలక్రమేణ । అన్యథా స్థాలీన్ధనాది సామగ్రి సంపర్క సంభవే ప్రథమ సమయేపి తస్యా భావోభవేత్, న చ భవతి తస్మాద్వ్యత్కృ తం తత్సర్వం కాలకృతమితి.

3. న కాలవ్యతిరేకేణ గర్భబాలయువాదికమ్
   యత్కించిత్ జ్ఞాయతే లోకే తదసౌ కాలణంకిల॥
4. కాలః పచతి భూతాని కాలః సంహరతే ప్రజాః
   కాలః సుప్తేషు జాగర్తి కాలోహి దురతిక్రమః॥

స్వతః జీవుఁడు నిత్యుఁడు. అతఁడు కాలాధీనుఁడు. సమస్త జగత్తు కాలకృతము. చంపకాశోక సహకారాది వృక్షములు పుష్ప ఫల భరితములగుట, హిమపాతము; నక్షత్రసంచారము బాల్య కౌమార యౌవ నాద్యవస్థలు కాలప్రభావము చేతనే కలుగు చున్నవి. జీవుల ఇష్టానిష్టములతో కాలమునకు పనిలేదు. సర్వ కర్మలు కాలకృతములే. సృష్టి స్థితి లయములకు కాలమే హేతువు. కాలము దురతిక్రమము. లోకమున గర్భ బాల్య యౌవనాది పరిణామములు కలుగుటకు కాలమే కారణము. కాన కాలమే సర్వమునకు కారణమని కాలాత్మవాదుల [illegible]

ఈ వాదమును స్వభావవాదులు తిరస్క[illegible] తమ [illegible] తము నిట్లు బలపరచిరి.



1. ఇహవస్తునః స్వతఏవ పరిణతిః
   స్వభావః, సర్వేభావాః స్వభావవశా
   దుపజాయన్తే, తథాహి -మృదః కుంభో భవతి
   న పటాదిభిః; తన్తుభ్యోఽపి పట ఉపజాయతే
   నఘటాదిభిః; తస్మా త్సకలమిదం స్వాభావ కృత
   మవస్తేయమ్.

2 కః కంటకానాం ప్రకరోతి తైక్ష్ణ్యం
   విచిత్రభావం మృగపక్షిణాంచ
   స్వభావతః సర్వమిదం ప్రవృత్తమ్
   న కామచారోఽస్తి కుతః ప్రయత్నః

3 యేన శుక్లీకృతా హంసాః
   శుకాశ్చ హరితీ కృతాః
   మయూరా శ్చిత్రితాయేన
   సనో వృత్తిం విధాస్యతి.

4 రాజీవ కేసరాదీనాం
   వైచిత్యం కః కరోతిహి
   మయూర చంద్రికాదిర్వా
   విచిత్రః కేన నిర్మితః॥

5 స్వభావతః ప్రవృత్తానాం
   నివృత్తానాం స్వభావతః
   నాహం కర్తేతి భూతానాం
   యః పశ్యతి సపశ్యతి॥

లోకములోని వస్తువులకు పరిణామము వాని స్వభావముచేతనే కలుగుచున్నది. సర్వభావములు స్వభావసిద్ధములు మృత్తునుండి ఘటనిర్మాణము సాధ్యమగును గాని పటనిర్మాణము సాధ్యము కాదు. అటులనే తన్తుజాలము పటోత్పత్తికి హేతువగును గాని

ఘటోత్పత్తికి హేతువు కాజాలదు.

కంటములకు తైక్ష్ణ్యము, మృగ పక్షి గణంబులకు విచిత్ర భావము; హంసలకు శుక్లత్వము శుకములకు హరితత్వము; మయూరాదులకు విచిత్రవర్ణము, రాజీవ కేసరాదులకు సౌరభ్యము ఎవనిచే కలుగుచున్నవి? అవి వాని స్వభావము చేతనే కలుగు చున్నవి గదా! జీవుల ప్రవృత్తినివృత్తులకు వారి స్వభావమే కారణమగుచున్నది. ఎవఁడు తన భావములకు తాను కర్త గాడని తలంచునో వాఁడే విజ్ఞుఁడు.

ఇట్టి స్వభావవాదమును నియతి వాదులు త్రోసిపుచ్చి తమ వాదము నిట్లు వివరించిరి.

1 నియతిర్నామ తత్త్వాన్తరమస్తి యద్వశా దేతే
భావాః సర్వేపి నియతేనైవరూపేణ
ప్రాదుర్భావ మశ్నువతే, నాన్యథా! తథాహి
యద్య దాయతో భవతి తత్త దాతత ఏవ నియతే
నైవరూపేణ భవదుపలభ్యతే, అన్యథా కార్య
కారణవ్యవస్థా. ప్రతినియతరూపవ్యవస్థా
చ న భవేత్. నియామకాభావాత్।

2 నియతేనైవరూపేణ
సర్వే భావా భవన్తియత్
తతో నియతిజా హ్యేతే
తత్స్వరూపానువేధతః॥

3 యద్య దైవయతో యావత్
తత్త దైవ తతస్తథా
నియతం జాయతే న్యాయాత్
క ఏనాం బాధితుం క్షమః॥

నియతి స్వతన్త్రతత్త్వము. ఈ నియతిచేతనే సర్వపదార్థము లుత్పన్నమగుచున్నవి. అనియతి పదార్థోత్పత్తికి హేతువు కాజాలదు. ఏది యే కాలమునకు ఏ వస్తువునుండి యుత్పన్న మగునో అది యా కాలమునకు ఆ వస్తువునుండి నియతిరూప మున ఉత్పన్నమగుచున్నది. ఈ నియతితత్త్వము లేనిచో లోకమున కార్యకారణవ్యవస్థయు, పదార్థముల నిశ్చయ స్వరూప వ్యవస్థయు నశించును.

నియతి వాదులను తిరస్కరించి ఈశ్వర వాదులిట్లు సిద్ధాంత మొనరించిరి.

1 అస్తి జీవః స్వతో నిత్యః ఈశ్వరః! ఈశ్వరవాదినశ్చ సర్వ జగదీశ్వర కృతం మన్యన్తే! ఈశ్వరంచ సహసిద్ధ జ్ఞాన వైరాగ్య ధర్మైశ్వర్య రూపచతుష్టయం ప్రాణినాంచ స్వర్గాపవర్గయోః ప్రేరకమితి-తదుక్తమ్

2 జ్ఞాన మప్రతిఘం యస్య
వైరాగ్యం చ జగత్పతేః
ఐశ్వర్యంచైవ ధర్మశ్చ
సహసిద్ధం చతుష్టయమ్

3 అజ్ఞో జన్తురనీశోయ మా
త్మనః సుఖదుఃఖయోః
ఈశ్వర ప్రేరితో గచ్ఛేత్
స్వర్గం వాశ్వభ్రమేవవా॥

జీవుఁడు స్వతః నిత్యుడైన ఈశ్వరాధీనుడు. ఈ జగత్తు ఈశ్వరాధీనము. ఈశ్వరుడు సహజసిద్ధమగు జ్ఞాన వైరాగ్య ధర్మైశ్వర్య చతుష్టయ సంపన్నుడగుటచే జీవులకు స్వర్గ నరకాదులను ప్రసాదించును.

ప్రమాణబద్ధులగు ఈశ్వరవాదులను సైతము ప్రతిఘటించి ఆత్మవాదులు తమ వాదము నిట్లు స్థాపించిరి.

ఆత్మవాదినో నామ "పురుష ఏవేదగ్ం సర్వమ్"
(ఋగ్వేద-పురుషసూక్తమ్, ఇత్యాది ప్రతిపన్నాం.

ఈసమస్త జగత్తు పురుషరూపమగు బ్రహ్మమై యున్నది. ఈ వాదము వేదాంతులకు సమ్మతమైనది, తత్త్వజ్ఞులామోదించిరి. గీతాచార్యుఁ డామోదించిన సిద్ధాంతము:-

> నజాయతే మ్రియతే వా కదాచిత్
> నాయం భూత్వా భవితావా న భూయః
> అజో నిత్యః శాశ్వతోయం పురాణో
> న హన్యతే హన్యమానే శరీరే"

ఈ యాత్మ ఎన్నడును పుట్టుటలేదు, (నజాయతే) ఎన్నడును మరణించుట లేదు. (నమ్రియతే) ఇంతకు మున్నుండి మరల క్రొత్తగా కలుగునది కాదు. అతఁ డజుఁడు (అజః) నిత్యుఁడు (నిత్యః). శాశ్వతుఁడు (శాశ్వతః) పురాతనుఁడు (పురాతనః) శరీరము నశించినను ఆత్మ నశించదు.

ఆత్మతత్త్వమును వేదాంత మిట్లు వివరించెను.

> దేహోనాత్మా జడోసౌ నచ విషయి
> మనస్థం మనో ధీవశం
> నాప్య జ్ఞాధీర్నో న చిత్తం ప్రణవన
> దగతం వ్యోమజన్యో ననాదః
> నాహన్తా సుప్తిలీనా న మునిని
> యమితః ప్రాణ ఏవం న
> సంవిజ్ఞాతురక్ష్యా; న జీవోప్యణు రఖిల
> జగతిః స్వప్రకాశః పరాత్మా॥

1 దేహోనాత్మా జడోఽసౌ- ఈ దేహము జడమగుటచే ఆత్మకాదు
2 న చ విషయి మనస్థం - ఇంద్రియములు ఆత్మకాదు.
3 మనో ధీవశం న - ధీవశమగు మనస్సు ఆత్మకాదు.
4 అజ్ఞాధీర్నో - అజ్ఞానయుతమగు బుద్ధి ఆత్మకాదు.
5 న చిత్తం ప్రణవనదగతం - ప్రణవమున లయమొందు చిత్త మాత్మకాదు.
6 వ్యోమజన్యో ననాదః - ఆకాశమునందు జనించు నాదము ఆత్మకాదు.
7 నాహన్తా సుప్తిలీనా - సుషుప్తియందు లయమగు అహంకార మాత్మకాదు.
8 న ముని నియమితః ప్రాణః - మునులచే నియమింపబడు ప్రాణ మాత్మకాదు.
9 ఏవం న సంవిత్ జ్ఞాతుర్వశ్యా-జ్ఞాతకు లోబడిన జ్ఞానమాత్మకాదు
10 న జీవోఽణుః - అణువగు జీవుడు పరమాత్మకాదు.
11 అఖిలగతిః స్వప్రకాశః పరమాత్మా- సర్వమునకు గతియు స్వ ప్రకాశముగల శ్రీమన్నారాయణుడే పరతత్త్వము అట్టి నారా యణుడే పరబ్రహ్మము.

"నారాయణ పరం బ్రహ్మ తత్త్వం నారాయ
ణః పరః'' అని శ్రుతినుడువుచున్నది,
"క్షీరే సర్పిః; తిలే తైలం; పుష్పే గంధః:
ఫలేరసః; కాష్ఠేగ్ని రివా న్తర్బహిశ్చ
తత్సర్వం వ్యాప్య నారాయణస్థితః"

క్షీరమునందలి ఘృతమువలె; తిలలయందలి తైలమువోలె; పుష్పమునందలి గంధముపగిది; ఫలమునందలి రసమురీతి; కాష్ఠ మునందలి యగ్ని భాతి; నారాయణుండు లోపలను వెలుపలను,

సర్వత్ర వ్యాపించి యున్నాడు. అతఁడు సర్వవ్యాపి.

"సర్వ వ్యాపీ నారాయణః"

గీతా శాస్త్రము దేహి దేహ సంబంధమును వివరించును. దేహము వేరు. దేహి వేరు. దేహము గలవాడు దేహి. దేహమే తాననుకొనుట జీవున కేర్పడిన యజ్ఞానము. దేహము నశించినను దేహి నశింపడు. అట్టి యీ దేహి యెవరు? అతనికీ దేహముతో గల సంబంధ మెట్టిది? మరణమనగా నేమి? ఈ విషయములు గీతాశాస్త్రమున చక్కగా వివరింపబడినవి. దేహము జడపదార్థము దేహమనగా

"శ్రు॥ తేషాం మనుష్యాదీనాం పంచ భూత సమవా
యః శరీరం జ్ఞాన కర్మేంద్రియైః జ్ఞానవిషయైః
ప్రాణాది పంచవాయు మనోబుద్ధి చిత్తాహంకారైః
స్థూలకల్పితైః సోఽపి స్థూలప్రకృతి రుచ్యతే
(యోగచూడామణ్యుపనిషత్) స్థూల శరీరావయవములగు

త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణములు; వాక్పాణిపాదపాయూపస్థలు; నఖ కేశ రక్త మాంసశల్యములు మొదలైన జడపదార్థముల యొక్క కూడిక. దేహ శబ్దమునకు వృద్ధిక్షయములు గలదనియర్థము. దేహ శబ్దార్థ వాచకములగు శరీర ఆకార మూర్తి తన్వాది శబ్దంబులు గూడ దేహము నాశాధీనమైనట్లు చెప్పుచున్నవి.

''అన్తవన్త ఇమేదేహాః'' అనునది గీతావచనము.

"వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరోపరాణి
తథా శరీరాణి విహాయ జీర్ణాని
అన్యాని సంయాతి నవాని దేహీ'' అను గీతాశ్లోకములో దేహము గాక దేహధారియగు చేతనుఁడు వేరుగ చెప్పబడి యున్నాడు. ఆ దేహధారియే పురుషుఁడనియు ఆత్మయనియు

దేహియనియు పిలువబడియున్నాడు.

దేహ దేహి సంబంధము వ్యక్తావ్యక్త జ్ఞ విజ్ఞానము వలన తెలియును. వ్యక్తమనగా కార్యరూపమగు ప్రపంచము. అవ్యక్త మన కారణరూపమగు ప్రకృతి. జ్ఞుడన పురుషుడు. కార్యరూపమగు వ్యక్త విజ్ఞానము వలన కారణరూపమగు నవ్యక్త విజ్ఞానము కలుగును. వ్యక్తావ్యక్త విజ్ఞానమును బట్టి వానికన్న భిన్నుడగు పురుషుని విజ్ఞానము కలుగును.

సృష్టిక్రమమును సాంఖ్యశాస్త్ర మిట్లు వివరించినది.

శ్లో॥ మూలప్రకృతి రవికృతిః మహ
దాద్యాః ప్రకృతి వికృతయ స్సప్త
షోడశకస్తు వికారో న ప్రకృతి
ర్న వికృతిః పురుషః”

(1) మూలప్రకృతి (2) ప్రకృతి వికృతులు (3) వికృతులు (4) పురుషుఁడు అను 25 తత్త్వములు సృష్టికి హేతువులగుచున్నవి

మూలప్రకృతిని అవ్యక్తమందురు. అది యవికృతి. సుశ్రుతాచార్యులు మూలప్రకృతి నిట్లు నిర్వచించిరి.

“సర్వభూతానాం కారణమకారణం సత్త్వ రజస్తమో లక్షణ మష్టరూప మఖిలస్య జగత్సమ్భవ హేతు రవ్యక్తం నామ. తదేకం బహూనాం క్షేత్రజ్ఞానా మధిష్ఠానాం సముద్ర ఇవౌ దకానాం భావానామ్’’

సర్వభూతంబులకు కారణంబును కారణాంతరముచే జనింప నందున అకారణంబును సత్త్వ రజస్తమో లక్షణంబును అష్టవిధ రూపంబును గలిగి స్థావర జంగమ ప్రపంచోత్పత్తికి హేతువైనది ‘‘అవ్యక్త’’ మనంబడును. ఇదియవయవ శూన్యంబై సముద్రము జలచరంబుల కాధారమగురీతి కర్మజీవుల కాధారంబై యుండును.

సృష్టిస్థితిలయంబులు ప్రకృతి సంభవంబులని గీతాశాస్త్రమిట్లు నుడువుచున్నది.

అవ్యక్తాదీని భూతాని
వ్యక్తమధ్యాని భారత !
అవ్యక్త నిధనాన్యేవ
తత్రకా పరిదేవనా''

సర్వభూతములు పుట్టుటకు మున్నులేవు. మరణమునకు పిమ్మట నుండవు. మధ్యకాలముననే గోచరించును. వానికై దుఃఖింపదగదు. అనగా సర్వ ప్రాణులు పుట్టుటకు పూర్వము నశించిన పిమ్మట అవ్యక్తము నందు లీనమగును. కాన సృష్టిస్థితిలయంబులకు అవ్యక్తమే హేతువగుచున్నది.

"తస్మా దవ్యక్తా న్మహానుత్పద్యతే తల్లిఙ్గ ఏవ"
అట్టి అవ్యక్తమువలన బుద్ధితత్త్వమగు మహత్తత్త్వము జనించును

"తల్లిఙ్గాచ్చ మహతస్తల్లిఙ్గ ఏవా హఙ్కార ఉత్పద్యతే"
అట్టి మహత్తత్త్వము వలన అహంకారము జనించును.

"సచ త్రివిధో వైకారిక స్తైజసో భూతాది రితి"
ఆయహంకారము వైకారికము (సాత్వికము) తైజసము (రాజసము), భూతము (తామసము) అని మూడు విధంబులు.
"తత్ర వైకారికా దహఙ్కారా త్తైజస సహాయా త్తల్లక్షణాన్యే వైకాదశే న్ద్రియాణ్యుత్పద్యన్తే. తద్యథా - శ్రోత్ర త్వక్చక్షుర్జిహ్వా ఘ్రాణ వాగ్ఘస్తోపస్థ పాయు పాద మనాంసీతి. తత్ర పూర్వాణి పఞ్చ బుద్ధీన్ద్రియాణి ఇతరాణి పఞ్చ కర్మేన్ద్రియాణి, ఉభయాత్మకం మనః''

రాజస సహాయ యుక్త సాత్వికాహంకారము వలన తల్లక్షణములు గల ఏకాదశేంద్రియములు జనించును. అందు శ్రోత్రము (చెవులు) త్వక్కు (చర్మము) చక్షువులు (నేత్రములు) జిహ్వ (నాలుక)

ఘ్రాణము (ముక్కు) అనుపంచేంద్రియంబులను బుద్ధీంద్రియం బులు లేక జ్ఞానేంద్రియంబు లనంబడు. వాక్కు (నోరు) హస్తము, ఉపస్థ, పాయు (గుదము) పాదము అనునవి కర్మేంద్రియంబులు. జ్ఞాన కర్మేంద్రియముల క్రియాకలాపమున కాధార మగుటచే మన స్సుభయాత్మకంబు.

"భూతాదే రపి తైజస సహాయా త్తల్లక్షణాన్యేవ పఞ్చతన్మాత్రాణ్యుత్పద్యన్తే. తద్యథా- శబ్దతన్మాత్రం, స్పర్శతన్మాత్రం, రూపతన్మాత్రం, రసతన్మాత్రం, గన్ధతన్మాత్రమితి.

రాజస సహాయ యుక్త తామసాహంకారము వలన తల్లక్షణములుగల శబ్ద స్పర్శ రూప రస గన్ధంబులను పఞ్చ తన్మాత్రలు జనించును.

తేభ్యో భూతాని వ్యోమానిలానలజలోర్వ్యః. ఏవ మేషా తత్త్వ చతుర్వింశతి ర్వ్యాఖ్యాతా.

ఆ పంచ తన్మాత్రల వలన నాకాశాది పంచ మహాభూతంబులు జనించును. శబ్ద తన్మాత్ర వలన ఆకాశము. ఆకాశము వలన శబ్దస్పర్శగుణములు గల వాయువు: వాయువు వలన శబ్ద స్పర్శ రూప గుణములు గల తేజస్సు; తేజస్సు వలన శబ్ద స్పర్శ రూప రస గుణములు గల ఉదకము; ఉదకము వలన శబ్ద స్పర్శ రూప రస గంధములు గల పృథివి అను పంచ మహాభూతంబులు జనించును.

తైత్తిరీయమునందు "ఆత్మన ఆకాశ స్సంభూతః ఆకాశాద్వాయుః; వాయో రగ్నిః అగ్నే రాపః అద్భ్యః పృథివీ; పృథివ్యా ఓషధయః; ఓషధీభ్యోఽన్నమ్" అని పంచభూతముల ఉత్పత్తి క్రమము చెప్పబడినది.

"పురుషః పఞ్చవింశతితమ స్సచ కార్యకారణ సంయుక్త శ్చేతయితా భవతి" ఇరువదియైదవ తత్త్వమగు పురుషుఁడు కార్యమగు

శరీరము తోడను కారణములగు నింద్రియాదుల తోడను గూడి పై తన్మాత్రయు డగుచున్నాడు.

1 అవ్యక్తము [మూలప్రకృతి] న్ను.
2 మహత్త్వము [బుద్ధి], అహంకారము, పంచ తన్మాత్రలు అను ప్రకృతివికృతి రూపంబు లేడును;
3 పంచ మహాభూతంబులు; ఏకాదశేంద్రియంబులను పదునారు వికారంబులు [వికృతులు]ను;
4 పురుషుండును- వెరశి24తత్త్వంబులుజగత్సృష్టికి హేతువు లగుచున్న వని సాంఖ్యులు నిరూపించిరి.

గీతాశాస్త్రమున శ్రీకృష్ణ భగవానుడు తన పరాపరప్రకృతులే సృష్టి హేతువులని యిట్లు నుడివియున్నాడు.

భూమి రాపో నలో వాయుః
ఖం మనో బుద్ధి రేవచ
అహంకార ఇతీయం మే
భిన్నా ప్రకృతి రష్టధా॥
అపరేయ మితి స్త్వన్యాం
ప్రకృతిం విద్ధి మే పరామ్
జీవభూతం మహాబాహో।
యయేదం ధార్యతే జగత్॥
ఏతద్యోనీని భూతాని
సర్వాణీత్యుపధారయ
అహం కృత్స్నస్య జగతః
ప్రభవః ప్రలయస్తథా॥

భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, మనస్సు, బుద్ధి హంకారము, అను ఎనిమిది విధములుగా నా అపరాప్రకృతి. విభజింపబడినది. దీనికంటె భిన్నమై, జగత్సృష్టికి హేతువై

జీవభూతమగు పరాప్రకృతి వేరొండు గలదు. ఈ పరాప్రకృతులే లోకమున సృష్టిస్థితిలయములకు హేతువు లగుచున్నవని పరమాత్మ వచించెను.

దేహము నశించినను దేహి గలఁడు.
దేహినోస్మిన్ యథాదేహే
కౌమారం యౌవనం జరా
తథా దేహాన్తర ప్రాప్తిః
ధీరః తత్ర న ముహ్యతి॥

దేహి బాల్య యౌవన జరాద్యవస్థలను బాసి దేహాన్తరస్థితిని బొందుచున్నాడు. దేహి నశింపడు. దేహమే నశించును. జీర్ణవస్త్రమును వీడి వేరొక నూత్నవస్త్రమును ధరించుపగిది దేహి మరణానంతరము వేరొక దేహమును ధరించుచున్నాడు దేహమును వీడుట యనగా స్థూలశరీరము నశించుటయే! ఇంద్రియ మనోయుతమైన సూక్ష్మశరీరము నశింపదు, జీవుడు సూక్ష్మశరీరము ధరించి పోవును. జనన క్రియయెట్టిదో మరణక్రియయు అట్టిదే!

అక్షరపరబ్రహ్మ యోగమున-
అన్త్యకాలేచ మామేవ
స్మరన్ముక్త్వా కలేబరమ్
యః ప్రయాతి స మద్భావం
యాతి నాస్త్యత్ర సంశయః

అన్త్యకాలమున నన్ను స్మరించుచు దేహమును వీడువాడు నా స్వరూపమును నిస్సందేహముగా పొందగలడని భగవానుఁడు జీవులకభయ మిచ్చినాడు.

పురుషోత్తమప్రాప్తి యోగములో-
మమైవాంశో జీవలోకే
జీవభూత స్సనాతనః

మనః షష్ఠానీన్ద్రియాణి
ప్రకృతిస్థాని కర్షతి॥

సనాతనమగు నా యంశమే జీవలోకమున జీవుడై ప్రకృతి యందుగల మనస్సును పంచజ్ఞానేంద్రియంబులను నాకర్షించుచున్నాడని భగవానుఁడు వచించినాఁడు. "మమైవాంశో జీవలోకే జీవభూతః" అనుటచే జీవలోకము నందలి జీవభూత మాతని యంశమని వ్యక్తమగుచున్నది.

యద్గత్వా ననివర్తన్తే

తద్ధామ పరమం మమ" దేనినిపొందిన జీవులు మరల తిరిగిరారో అదియే శ్రేష్ఠమగు స్థానమనుటచే జీవుని గమనాగమనములు సూచింపబడినవి.

పురుషోత్తమప్రాప్తియోగమున-
శరీరం యదవాప్నోతి
యచ్చాప్యుత్క్రామతీశ్వరః
గృహీత్వైతాని సంయాతి
వాయుర్గన్ధా నివాశయాత్

జీవుఁడు శరీరమును బాసి నూతనశరీరమును బడయునప్పుడు-వాయువు పుష్పాదుల నుండి గంధమను గొంపోవు చందమున పంచేంద్రియంబులను మనస్సును గ్రహించి వెడలు చున్నాడనుటచే జీవునకు సూక్ష్మదేహము గలదని తెలియుచున్నది.

ఈ వగిది జీవుఁడు పూర్వ సంస్కారములచే మఱఁమరల జన్మించుచున్నాడు. అతఁడు జ్ఞానేంద్రియములను మనస్సును ఆశ్రయించి విషయసుఖముల ననుభవించు చున్నాడు. ఈ యింద్రియములయిదును తమ స్థానములందుండి జీవునకు సేవ చేయుచున్నవి.

కాన శరీరము వదలి పోవునప్పుడును, మరణమునందును జీవుడున్నాడు. మరణ మనగా స్థూలకాయము జీవునకు వ్యవహార యోగ్యము కాకుండుట. జీవుడు లేచిపోవునప్పుడు సూక్ష్మేంద్రియములను; సూక్ష్మకరణములైన మనోబుద్ధిచిత్తాహంకారములతో పోవుచున్నాడు.

జాతస్య హి ధ్రువో మృత్యుః
ధ్రువం జన్మ మృతస్యచ
తస్మా దపరిహార్యేఽర్థే

న త్వం శోచితు మర్హసి" అనుటచే జీవునకు జననమరణములు నిత్యములని తెలియుచున్నది. దేహి దేహముతో గావించిన ధర్మాధర్మరూపమైన కర్మలు వాని చిత్తమునందు సంస్కారరూపమును పొందియుండును, ఈ సంస్కారములకు దగిన ఫలానుభవములను ఏ శరీర మందు జీవున కనుభవ యోగ్యము చేయవలయునో, సుఖదుఃఖ రూపములగు ఫలముల నీయవలయునో ఫలప్రదాతయగు పరమేశ్వరుడే నిర్ణయించి యొసంగు చుండును. అపుడీ జీవునకు కొత్త దేహము వచ్చినదని యందుము అదియే జీవుని పుట్టుక దేహమును వీడుటయే మరణము.

జీవుడు నిత్యసంసారి. ధర్మానుష్ఠానముచే చిత్తశుద్ధిని సాధించి, ఆత్మజ్ఞానమును పొంది స్థితప్రజ్ఞుడు కావలయును. అప్పుడే జీవుడు సంసారము నుండి ముక్తుడగును.

దేహ మొక రథము. ఇంద్రియములు లా రథమునకు బూన్చిన తురంగములు. బుద్ధి రథమును నడుపు సారథి. గుఱ్ఱములు సారథి యధీనములో నున్నప్పుడే రథగమనము సక్రమముగా సాగును. అటులనే బుద్ధికి లోబడి యింద్రియములు పని చేయవలయును గాని, ఇంద్రియముల యధీనమున దేహముండరాదు.

కావుననే మన ధర్మశాస్త్రములు. "జీవితయాత్రలో మోక్ష స్థానమగు గమ్యస్థానమును జేరుటకు కర్మకుశలుండవై. యోగ కుశలుండవై, భక్తికుశలుండవై, వైరాగ్యసంపన్నుడవై ప్రజ్ఞాశాలివి కమ్మని బోధించుచున్నవి. దీనిని బడయుటకు ధర్మమే శరణ్యము. ధర్మ మిష్టప్రాప్తికిని అనిష్ట పరిహారమునకును సాధన మగుచున్నది. ఇది విధినిషేధ రూపములో నుండును. ధర్మమునకు శాస్త్రమే ప్రమాణము.

దైవాసుర సంపద్విభాగ యోగమున కృష్ణపరమాత్మ శాస్త్రప్రయోజనము నిట్లు వివరించెను.

> తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం
> తే కార్యాకార్య వ్యవస్థితౌ
> జ్ఞాత్వా శాస్త్ర విధానోక్తం
> కర్మ కర్తు మిహార్హసి॥

కార్యాకార్య వ్యవస్థితిని నిర్ణయించుటకు శాస్త్రమే ప్రమాణమై యున్నది. శాస్త్రబద్ధమగు కర్మలనే నియతముగా చేయవలయు నని పరమాత్మ శాసించినాడు.

> య శ్శాస్త్రవిధి ముత్సృజ్య
> వర్తతే కామకారతః
> న సిద్ధి మవాప్నోతి
> న సుఖం న పరాంగతిమ్

శాస్త్రవిధిని వీడి స్వేచ్ఛగా వర్తించు వాడు పురుషార్థ సిద్ధిని గాని, సుఖమును గాని మోక్షమును గాని బడయ నేరడని భగవానుని యాదేశము గీతాశాస్త్రములో గోచరించుచున్నది.

కాన శాస్త్రనియతమగు కర్మాచరణ మొనరించి జ్ఞానప్రాప్తిని బడయుటయే జీవుల కర్తవ్యము. ఇదియే గీతాశాస్త్రము మన

కొసంగు మహోన్నత సందేశము.
తుదిమాట-

చిరంజీవి రామకృష్ణమాచార్యులచే రచింపబడిన "శ్రీభగవద్గీతాంధ్రానువాదమును కేవలము విమర్శనాదృష్టితో కాక స్థాలీపులాకన్యాయమున పరిశీలించితిని. ఇతడు బాల్యమున నా యొద్ద విద్యాభ్యాస మొనరించి తదుపరి భాషాప్రవీణ మున్నగు పరీక్షల యందుత్తీర్ణుడై ప్రస్తుతము వడ్డివారిపాలెములోని శ్రీమతి సావిత్రీగణేష్ ఉన్నతపాఠశాలలో నాంధ్రభాషాపండితునిగా పనిచేయుచున్నాఁడు. ఈతనిలో కవికి వలయు భావావేశము, ఉత్సాహము మెండుగా గోచరించుచున్నవి.

ఒకనాడు ఏదో సందర్భమున పేదనాయుతముగా నేను వ్రాసిపంపిన లేఖను గాంచి భావోద్రేకపరుఁడై యీ తీరున నాకు లేఖ వ్రాసెను.

> శోకవాక్యమె బోయకు శ్లోకమయ్యె
> మీదు లేఖయు నాయెడ మీటె; నంత
> సత్త్వగుణమున మానస జనితమైన
> భావగీతిక గీతయై పలికెనోట.

తేటతెలుఁగున పలుకు నా నోటి మాట
పూటపూటకు నొకవింత పాటవోలె
పలుకుచున్నది గణముల కులుకు లొప్ప
కలయొ. వాస్తవమో యిట్లు పలుకుచుంటి.
కృష్ణగీతలు తెలుఁగున గీతలొప్ప
వ్రాయ దలచితి గురుదేవ! రత్నమార్య!
భవ్య కవితలు నానోట పలుకునట్లు,
నిండుమనసున నాశీస్సు లిండు మీరు.

సాహసంబున బూనితి సాధుచరిత!
కవిత వ్రాయుట తేలిక కార్యమగునె?
చేతబూనిన కార్యము చేయువరకు
రెప్ప వాల్చను నేనింక రేయిబవలు॥

అనుచు తన యిలవేలుపగు శ్రీరామచంద్రుని ప్రేరణచే గీతాను వాదమును ప్రారంభించితిననియు, ఆశీస్సు లొసంగుమనియు లేఖవ్రాసెను. అతనిలో నుదయించిన భావావేశమున కచ్చెరువంది "వాణి యనుగ్రహముచే నీకు చిత్తశుద్ధి చేకూరి నూతన జీవిత్ర పథాన్వేషణలో నిమగ్నుడవు కావలయునని నాయభిలాష.

శ్రియఃపతి నిన్ననుగ్రహించుగాత! రామకృష్ణులు రామకృష్ణుని ధర్మబద్ధుని గావించి కాపాడుగాత!" అని నాయాశీస్సులను లేఖ మూలమున నందజేసితిని. ఆ యావేశబలమే చిరంజీవిని యీ కార్యక్రమమునకు ప్రోత్సహించి యుండ నగునని భావించు చున్నాడను. ఈతఁడీ గ్రంథము ననువదింప నెంచుట కొంత సాహసమైనను, దైవప్రేరణయే ఈ కార్యము నందితనికి తోడుపడి యుండవచ్చునని నా తలంపు. వేనిచో నీతఁడు నుడివిన రీతిగా "కవితాధోరణి, శాస్త్రగ్రంథపఠనము లేని" ఈతఁడీ మహాకార్యము నెట్లు నిర్వహింప గలిగెను? "నేను పలికింతు నీనోట నిపుణరీతి" అను దివ్యపురుషుని ప్రేరణమే యాతని కిటు తోడ్పడి యుండ వచ్చును. పైగా యీతనికి శ్రీ వేంకటేశ్వరుని యనుగ్రహము గూడ లభించుట యదృష్టమననగును.

ప్రాచీన కవులెందరో దైవప్రేరణచే తొలిగ్రంథములను రచించి దైవమునకే అంకిత మొనరించి చరితార్థు లగుట మనకెల్ల విదితమే!

ఈ చిరంజీవి రామకృష్ణమాచార్యులి కార్యక్రమమున కృత

కృతజ్ఞుడై నందులకు మిక్కిలి సంతసించుచున్నాడను. శ్రీ వేంకటేశ్వరుఁ డీతని ననుగ్రహించుగాత!

ఇందలి రచన సులభమై తేటతెనుఁగులో నొప్పుచున్నది. సంస్కృతములో గీతాశాస్త్రమును పఠించలేనివారికి అందలి భావములు సుగమముగుట కీగ్రంథమెంతయో తోడుపడగలదు ఈ గ్రంధము కేవలము మహాపండితుల కొఱకు వ్రాయబడినది కాదు. పామరులను దృష్టిలోనుంచుకొని వారికి గీతార్థ మనగతమగుట కీగ్రంథమును రచించెను. అందుచే వ్యాకరణాది దోషంబు లిందు పరిహరణీయంబులు.

"తాను పండితుఁడను కాననియు,

శాస్త్రపరిజ్ఞాన మంతగా లేదనియు, బాల్యచాపల్యముచే తాని మహత్తర కార్యమునకుపక్రమించితి ననియు, దొసగు లుండవచ్చు ననియు, మన్నించ వలయుననియు" విజ్ఞులను వేడుకొనుట యీతని వినయ శీలమునకు తార్కాణ మగుచున్నది.

నే నీతనికి గురువునగుటచేతను. ఉత్సాహప్రోత్సాహము లొసంగి యీతని సాహితీకృషిని పెంపొందించు కాంక్ష గలవాడ నగుటచేచేతను. ఆతని కోర్కి మై, నేనీ యాముఖమును వ్రాయ సాహసించితిని గాని, అందులకు సమర్థుడనని నిరూపించుకొనుటకు గాదు.

గీతాశాస్త్రము పవిత్రమైన గ్రంధము. ఈ గ్రంధమునకు మహామహు లెందరో వ్యాఖ్యలు రచించి తరించిరి ఆచార్య త్రయము భాష్యములను రచించిరి శ్రీ ధరీయ ఆనందగిరి కల్యాణి మొదలగున వెన్నియో వ్యాఖ్యలు గలవు.

ఇట్టి మహోన్నత పవిత్రగ్రంధమునకు నే నాముఖమును వ్రాయుట సాహసమైనను చిరంజీవి కోర్కి మై, శిష్యవాత్సల్య ముతో, పుత్రవాత్సల్యముతో రచించుటకు సాహసించితిని. విజ్ఞులు

మన్నింతురు గాక! శ్రీయుఃపతి చిరంజీవి రామకృష్ణుని యనుగ్రహించుగాక.

ఓమ్-తత్-సత్

మచిలీపట్టణము<br>2—8—1981

నల్లూరి వేంకటరత్నమహాచార్యులు<br>M. A., B Ed.



# ఉపోద్ఘాతము

వేదములపౌరుషేయములు. మహామహుఁడగు వేద వ్యాసుఁడు వానిని నాలుగు భాగములుగా విభజించెను. వేదములు సులభ గ్రాహ్యములుగావు. అందుచే వేదార్థములను ప్రతిపాదిం చుటకు వ్యాసుడనేక పురాణములను రచించెను. వానిద్వారా ప్రజలకనేక హితబోధల గావించెను. భారత భాగవతాది యితిహాస ములచే ప్రజలకు వేదవిషయములను సులభ గ్రాహ్యమగునట్లు చేసెను.

భారతము సర్వవేదముల సారము. అది పంచమవేదము. దీనిలో వ్యాసుడు ధర్మాధర్మములకు, సత్యాసత్యములకు న్యాయా న్యాయములకు, సాత్త్విక తామసములకు గలుగు ఘర్షణను దుర్యోధనాది పాత్రలద్వారా చక్కగా వివరించెను. ఇట్టి ఘర్షణ. జీవుని హృదంతరాళమందు నిత్యము జరుగుచునే యుండును. ధర్మ ప్రతిపాదకమగు భారతేతిహాసము సర్వ కాలములయందు ప్రజల కాదరణీయము. దుర్గమార్థ జల గౌరవ భారత భారతీ సముద్రము దఱియంగ నీదను విధాతృనకైనను సాధ్యముగాదు అట్టి భారతమును వ్రాసినవాఁడు సూరిచేతో రుచిరాబ్జ బోధన రతుండగు పరాశరాత్మజుఁడు.

పరమ పవిత్రమైన భారతేతి హాసములో కౌరవ పాండవు లకు సంఘటిల్లిన మహాయుద్ధ మధ్యమున భగవంతుడగు శ్రీకృష్ణుడు అర్జునునకు నుడివిన పరమ గుహ్యమగు భగవద్గీత ములను వ్యాసుడు గుప్తపఱచి, అధ్యాత్మవిద్యను ప్రజలకందిం చెను. గీత ఉపనిషత్సారము. బ్రహ్మవిద్య. యోగశాస్త్రము. భార తామృత సర్వస్వము.

"సర్వోపనిషదో గావో
దోగ్ధా గోపాల నందనః
పార్థో వత్సః, సుధీర్భోక్తా
దుగ్ధం గీతామృతం మహత్."

ఉపనిషత్తులనే, గోవులనుండి పార్థుని, నిమిత్తమాత్రమైన వత్సముగాజేసి శ్రీ కృష్ణభగవానుడు గీతామృత క్షీరమును పిదికి నాడు. బుద్ధిశాలురు దీనిని గ్రోలి యమరులగుదురు. ఈ గీతామృతము మహత్తరమైనది. నుడివినవాడు శ్రీ కృష్ణభగవానుడు. వినినవాడు కృష్ణుడు. ( పాండవానాంధనంజయః అని కృష్ణుడు పేర్కొనెను. 10-35) వ్రాసినవాడు కృష్ణుడు. (మునీనా మప్యహం వ్యాసః 10-35)

కృష్ణత్రయముచే వెలువడిన యీగీతా గంగోదకము ద్రావిన నరునకు పునర్జన్మముండదు. నరునకజ్ఞాన తమమును పోద్రోలి విజ్ఞాన తేజమును కలిగించు పరమ పవిత్రమైనది గీత. భగవత్తత్త్వము. భగవత్ప్రాప్తి మార్గములిందు వివరింపబడినవి. కర్తవ్యతా విమూఢుడై దీనుడై యహంభావ పూరితుడై అనార్య జుష్టము అకీర్తి కరము నైన హేయదైన్య భావమును పొందిన యర్జునునకు ధైర్యమునిచ్చి అహంభావమును పోగొట్టి కర్తవ్య మార్గమును బోధించుటకు భగవానుడు దీని నుపదేశించెను. ఇది యొక్క అర్జుననకే పరిమితమైనదిగాదు. ప్రతిజీవికి కలిగే సంశయావస్థలో జ్ఞాన తేజమునిచ్చి కర్తవ్యమార్గము నుపదేశించుట కుద్దేశింప బడినదే గీతా శాస్త్రము.

గీత భగవన్నిర్మితము. ఇది యేయొక్కరి సొత్తునుగాదు. ఒకకాలమునకుగాని, మతమునకుగాని, కులమునకుగాని, ఒకదేశమునకుగాని సంబంధించినదికాదు. స్త్రీ, పురుష, శూద్ర, చండాలాది భేదములు గీతాపఠనమునకు, యోగసాధనకు అడ్డంకు కాజాలవు. భగవంతుని యందు భక్తి, ప్రపత్తులు గలవారందఱు గీతా పఠనమున కర్హులు కాగలరు. మానసిక క్షోభను పొందిన ప్రతి మానవుడు గీతామాత యొడిలో తలదాచుకొని, శ్లోకామృత దుగ్ధములాని సేదదీరవచ్చును. చిత్త స్థైర్యమును బొందవచ్చును. మానవ దేహ క్షేత్రములో ఇంద్రియములకు, బుద్ధికి జరిగే సంఘర్షణలో బుద్ధికే జయము కల్గునట్లు చేయు విజయసాధనము గీత.

భగవానుడే గీతాజ్ఞానము నాశ్రయించి లోకముల పాలింప గలుగుచుంటినని స్పష్టముగా నుడివియుండెను. జనకుడాదిగ గల్గురాజర్షు లందఱు గీత నాశ్రయించియే కల్మషదూరులై మోక్షమును బొందిరి. గీతాజ్ఞానము నుపదేశించియే కృష్ణు డర్జునుని కర్తవ్య పరాయణు డగునట్లు చేయగల్గెను.

గీత సమదృష్టిని మానవునకు ప్రసాదిస్తుంది. గీత కర్తవ్య నిష్ఠనే ముఖ్యముగా నుపదేశించు చున్నది. కర్తవ్య పాలనలో గూడ నిష్కామ తత్త్వమే ముఖ్యమనునది గీతాసారము. గీత సర్వ ధర్మములకు మాతృభూమి. సర్వశాస్త్రముల సారమేగీత. సర్వమతముల సార మిందుగలదు. కాన నిది విశ్వమత గ్రంథము.

గీత విజ్ఞాన కల్పతరువు. మోక్షకాంక్షులకు కొంగుబంగారము. అర్థార్థులకు పరమార్థదాయిని. అమృత మయమగు అధ్యాత్మవిద్య.

భారతీయ వేదాంత తత్త్వ భాండాగారము. కలుషహారిణి. మోక్ష ప్రదాయిని. జన్మ సంసార రూపమైన దుఃఖ జలధిని దాటించునావ. మోహ పాశములను ఛేదించు జ్ఞానాసి. అజ్ఞానతమమును పోద్రోలు దివ్యదీప్తి. భగవత్తత్వ దర్శన లాలసులకు గీతయే దివ్యనేత్రము. ఆత్మానంద ప్రాప్తియే గీతాలక్ష్యము. భగవత్తత్వ పరిశీలనా భ్యాసరతులగు జిజ్ఞాసువులకు పిపాసను దీర్చు దివ్యామృత ఝరి గీత.

కర్మ, భక్తి, జ్ఞాన యోగములనెడు త్రివేణీ సంగమముగీత. ఈ గీతాజలముల మునిగిన వానికి సంసార సంబంధమగు మోహ దుఃఖాది మలినము లన్నియు తొలగి పోవును. గీతా పఠనమునకు కాల నియమములేదు. బహ్యాంతర శౌచములు గలిగి భక్తి శ్రద్ధ లతో గీతాపఠనము జేసినవానికి మోక్షము కరతలామలక మగుటలో సందియములేదు.

గీత యొకయమృత భాండము. ఎందరెంత యాస్వాదించి నను యాయమృతము తరుగదు. గీత దివ్యామృత ప్రవాహము. అది ప్రవహించినంత మేరకు జనుల యజ్ఞాన పూరిత హృదయ క్షేత్రములందు విజ్ఞాన బీజములు మొలకెత్తి ముక్తి పంట పండును. జనులీ గీతామృత ప్రవాహమున జలకములాడి సంసారమాలిన్య మును క్షాళన చేసికొని పునీతు లగుదురుగాక.

ఓం తత్సత్

మంగళమ్ మహత్

# విజ్ఞప్తి

నేను పండితుఁడనుగాను. శాస్త్ర పరిజ్ఞాన మంతగాలేదు' అను వంశికముగా వచ్చిన శౌచాచారములే నాకున్న సంపద. గీతను పూర్తిగా చదువుటయు నాకిదే ప్రథమము. మా బావగారును, గురువును నైన, శ్రీ నల్లూరు వెంకటరత్నమాచార్యులు గారు నిరంతరము గీతా పఠనము జేయుచు, అనేకమంది మహనీయుల విమర్శలను చేదువుచు, అందలి విశేషాంశములను నా కపుడపుడు వివరించి చెప్పు చుండెడివారు. అదియే గీతపై నాకు మక్కువ కలుగుట కు కారణము.

పాండిత్యము లేకున్నను బాల్యచాపలముతో నేనీ మహత్తర కార్యమున కుపక్రమించితిని. శక్తికి మించిన పనియైనను, భగవానుని యనుగ్రహమున యనతి కాలమునసే దీనిని పూర్తిగావించితిని. ఉపనిషత్సారమైన ఈ గీతానువాదము నాశక్తికి మించినదైనను చేతనైనంతవరకు యధామూలముగ ననువదించిననియే యనుకొను చుంటిని. అందందు దోసగులుండియు నుండవచ్చును. నా యీసాహస కృత్యమునకు మన్నించి బుధులు దీనిని క్షీరనీర న్యాయమున బరిగ్రహించి ఆశీస్సు లొసంగ ప్రార్థించుచున్నాను.

ఇందు సంధి నియమములను బాటింపకమే కొన్నియెడల పదముల నుపయోగించుట జరిగినది. సామాన్యజనులకు నైతము అందు బాటులో నుండి చదువుటకు సులువుగా నుండునను సదుద్దే

శముతో అటుల వాడుట జరిగినది. దొసగులేమైన నున్నచో పండితులు సహృదయమున తెలియబఱచిన ధన్యవాదములతో స్వీకరించగలను.

మంగళమ్ మహత్.

ఓంతత్సత్.

ఇట్లు
బుధజన విధేయుడు,
బృందావనం రామకృష్ణమాచార్యులు
భాషాప్రవీణ.



# గీతానువాద కారణము

స్వస్తి శ్రీ చాంద్రమాన రౌద్రినామ సంవత్సర ఆషాఢ శుద్ధ తదియనాడు సాయం సమయమున సంధ్యా వందనాదికము పూర్తిగావించుకొని శ్రీ రాముని సన్నిధిన కూర్చుని మంత్ర సూక్తముల పారాయణము చేసికొనుచుంటిని. పారాయణము పూర్తియగుసరికి నాశరీరమం రోమాంచము కలిగినది. ప్రసన్న వదనముతో, ఎవరో ఎఱుగరాకున్న దివ్యపురుషుడొకఁడుసమున్న తాకారముతో, అభయహస్తముతో నాముందల నిలచియున్నట్లు దివ్యానుభూతి కలిగినది.

"జన్మ సంసారబంధమోక్షము నిచ్చునదియు, నారాయణు నిచే స్వయముగా పార్థునకుపదేశింప బడినదియు, ఉపనిషత్సా రమును, వ్యాసరచితమును నైన గీతను తెలుఁగులో గీతములుగా ననువదింపు" మను నా దివ్య నాజ్ఞ నాయంతరాంతరములలో మారుమ్రోగినది. కవితా ధోరణిగాని, శాస్త్రగ్రంథ పఠనముగాని లేని నేనా మహాకార్యము నెట్లు నిర్వహింతునాయని సందేహపడు చుండగా మరలనాతడే "నేనవలికింతు నీనోట నిపుణరీతి" యని పలికినట్లు నాచెవులబడినది. నాయిలవేల్పగు శ్రీరామచంద్రుడే నన్నిట్లు శాసించెనని భావించి, ఆక్షణమే నాదైవమునకు పునః పూజలుగావించి; శ్రీ మద్భగవద్గీతను తొలిసారిగా పఠించి యనువా దమునకు బూనుకొంటిని. అల్పజ్ఞానము కలవాడనైనను భగవ త్ప్రేరణచే మోక్షకాంక్షినై నేనీమహాకార్యమున కుపక్రమించితిని.

తదాది గీతానువాదము పూర్తియగు నంతవరకు నాదివ్యుని యాకారము నాముందు నిలచియుండినట్లే నాయంతరాత్మకు దోచు

చుండెడిది. నాకదొక దివ్యానుభూతి. అదివ్యానుభూతియే. నాయీ గీతానువాదమునకు కారణమైనది.

ఇదియొక కల్పితగాథవోలె నున్నదని జనులు నవ్వినవవ్వు కొందురుగాక. ఇది నా ప్రత్యక్షానుభవము. అనిర్వచనీయము, అనుభవైక వేద్యము, అమందానంద దాయకము, నైన యొక యద్భుతసంఘటన. మరపురాని మరచిపోలేని యొకమధురాను భూతి. నాజీవనగతినేమార్చి ఆముష్మికచింత నాలోరేకెత్తించిన యొకదివ్యుని దివ్యసందేశము. ఆ యమృతానుభవమే, ఆ దివ్యుని ప్రేరణయే నాచేత నీ మహాకార్యము చేయించినవి. ఎన్నడును ఛందోబద్ధముగా నొక్కచరణమైనను వ్రాయలేని నేను గీతను గీతములలోని కనువదించుట భగవదాదేశమే గాని యితరముగాదు.

కుముదవల్లి బృందావనము నుండి శ్రీనివాసుని చరణసేవకు సమర్పించబడిన తొలిమాలిక నా యీకృతి. ఊపిరి యున్నంతవరకు భగవానుని చరణసేవకు ఇట్టి మాలికలను తయారుచేయు వలయు నన్నదే నా యాకాంక్ష.

భగవదర్చనాభిలాషి,
రచయిత



గీతాపఠనము వలన గల్గు లాభమేమి ?

త

కలుషములు బాపి నరునకు కాంతినిచ్చు
దుఃఖములు బాపి నరునకు త్రోవజూపు
సర్వజనులకు ఘనమగు శాంతినిచ్చు
మోహ మెడలించి నరునకు మోక్షమిచ్చు.

## అంకితము

శ్రీకి నిలయుండు సప్తగిరీశుఁ డెపుడు
తనకు కోడలు చదువుల తల్లి కొఱకు
మంచి కవితల మాలిక లెంచికొనడె
అలుక గొనకున్నె కొనకున్న పలుకులమ్మ !

తేటతెనుఁగున వ్రాసిన దివ్యమైన
కృష్ణపార్థుల సంవాద గీతములను
వడ్డికాసుల వానికి వరలు భక్తి
నంకితము జేతు మోక్షము నందు కొఱకు



## శరణాగతి

శ్రీనివాసుని దలచిన చింతదొలగు
శ్రీనివాసుని గొలిచిన సిరులుగలుగు
వేంకటేశ్వరుఁ బ్రార్థింప విజయమగును
వృషభశైలేశు చింతన వేదపఠన. 1

కలియుగంబున కధిపతి, ఘనుడు నైన
వేంకటేశుని సాటియౌ విభుడులేడు
తిరుమలకు నుద్దియైనట్టి తీర్థమేది
నిఖిలజగమున లేదిది నిశ్చయంబు. 2

శరణు జేరెద వేంకటేశ్వరుని దివ్య
పాదముల యందు, నిరతము పరమభక్తి
శరణు జేరిన వారికా సారసాక్షు
డాదరంబున నొసగడె యభయ మెపుడు. 3



# దైవ ప్రార్థన.

:- శ్రీనివాస స్తుతి :-

రామ రమణియు నిరువంక రాణమీర
కొండలేడిట నెలకొని యుండువాని
పుడమిజనులకు నిష్టార్థ పూర్తి జేయు
వేంకటేశ్వరు ప్రార్థింతు వినతితోడ. 1

:- శ్రీరామ స్తుతి :-

అసురసంహార మొనరించి యతివగూడి
హనుమ సేవింప రత్నసింహాసనమున
నభయముద్రతో నాసీను డైన విభుని
దశరథాత్మజు ప్రార్థింతు ధరణిగావ. 2

-: శ్రీకృష్ణ స్తుతి :-

వేణుగానము చేసి గోవిందుడగుచు
చేరి బృందావనాంతర సీమలందు
గోపికల తోడ నర్తించు గోపబాలు
చేరి కొలుతును సంసార చింతతొలగ. 3

-: ఆంజనేయ స్తుతి -:

రామ ! రఘురామ ! శ్రీరామ ! రామ యంచు
రామనామము జేయుచు రక్తితోడ
తలచి నంతనే భక్తుల దరికిజేరి
అభయ మిచ్చెడు హనుమకు నంజలింతు. 4

-: సరస్వతీ ప్రార్థన :-

వీణ మీటుచు విధునకు వీనులలర
వినుతి చేసిన వారికి విద్యలొసగు
సారసాక్షికి, వికసిత జలజముఖికి
నలువరాణికి వాణికి నతులుసేతు. 5

-: వ్యాస స్తుతి:-

వేదముల వింగడించిన విమలమతికి
వేదసారము జయమున విశదపరచి
జగతి కుపదేశ మిచ్చిన జటివరునకు
వ్యాసునకు జేతు మనసార వందనంబు. 6

-: గురు వందనము :-

మొదట నుతియింతు లక్ష్మీశు మూలపురుష
మ్రొక్కు లిడెదను విఖనసమునికి బిదప
విద్య గరపిన విబుధుడు విమలయశుడు
రత్నమార్యుని వినుతింతు రమ్యగుణుని. 7

-: కవి వందనము -:

పూర్వకవులకు ప్రణతులు పొసగజేతు
నాధునికులకు మనసార నంజలింతు
నాంధ్రమున గీతజేసిన యట్టిమేటి
భక్తజనులకు నా ప్రియ వందనములు. 8

# కవి వంశానుక్రమణిక

మహితమై యొప్పు గుంటూరు మండలమున
పండితావాసమై వెల్గు పల్లె యొకటి
గుణవతంసుల నెలవది కుముదవల్లి
కుముదవల్లియె యీనాటి గూడవల్లి. 1

కుముదపురిలో భరద్వాజ గోత్రమందు
వాసికెక్కు బృందావనాన్వయము నందు
జలజగర్భుని సద్వంశ చక్రమందు
విఖనసాచార్య సత్కుల వితతియందు. 2

జనన మందె నారాయణాచార్య వరుడు
వేద వేదాంగముల యందు విబుధుడతడు
శౌచ మాచారమును గల్గు సాధుజనుడు
దేవ పూజల విడువని ధీయుతుండు. 3

సాధుజనుడు నారాయణాచార్య వరుడు
గాంచె నొకపుత్త్రి రంగమ గర్భమందు
సాధువర్తను కృష్ణమాచార్యవర్యు
బుద్ధిశాలిగ నతడు ప్రసిద్ధి గాంచె. 4

ఆగమ విశారదుడనుచు యశము గాంచి
అమలవర్తను డాతడ త్యంతభక్తి
వేంకటేశ్వరు పాదారవిందములను
నిత్యమును గొల్చు నత్యంత నిష్ఠతోడ. 5

యజ్ఞవిధులన్ని యెఱిగిన యాజ్ఞికుండు
ఆగమములన్ని తెలిసిన యర్చకుండు
సత్త్వగుణశాలి! ధీశాలి, సాధుశీలి;
సదయహృదయుడు కృష్ణమాచార్యవరుడు. 6

సజ్జనుండగు కృష్ణమా చార్యవరుడు
వధువు వేంకటరంగము పాణి పట్టె
పరమ మనుకూలురైన దంపతుల గాంచి
జగతి నుతియించె చక్కని జంట యనుచు 7

అత్తమామల పరిచర్య లందు మేటి
పేదసాదల మన్నించు పెద్ద యగును
ఆశ్రితుల పాలి కమరిన యమరతరువు
సాధువర్తిని కృష్ణమాచార్య దేవి. 8

సుతుల నార్వుర నిద్దఱు సుతల గాంచి
సంతసంబున మునిగె నాచార్యజంట
చదువుసందెలు వినయము చాల గలిగి
వృద్ధిబొంధిరి బిడ్డలు విబుధులైరి. 9

సీ॥ వారిలో.

రాజ్యలక్ష్మమ సుగుణాల రాశి యగును
తమ్ములందఱఁ బ్రేమించు తల్లివోలె
ఆమె వరియించె విద్యచే నధికుడైన
రత్నమార్యుని, విబుధుని రమ్యగుణుని. 10

సత్యనారాయణుం డతి సజ్జనుండు
వైద్యవృత్తిని గైకొని వాసి గాంచె
సర్వజనమాన్యు డయ్యె సద్వర్తనమున
నతడు చేపట్టె జయలక్ష్మి ననఘచరిత. 11

ఆర్యగుణుడు రాధాకృష్ణు డమలయశుడు
పరమ ధీశాలి యతిమిత భాషణుండు
భవ్యచరితుడు పరహిత భాషణుండు
పడతి లక్ష్మినాంచారమ్మ పాణి బట్టె. 12

లక్ష్మితాయారు తరుణీలలామ యగును
కుసుమ సుకుమారి, సద్గుణ, కోమలాంగి
వేదవిదుడును, విబుధుడున్ పెజ్జయైన
శ్రీనివాసుడు లక్ష్మమ చేయిబట్టె. 13

అప్పలాచార్య డనఘుడు సర్వవిదుడు
సాధుచరితుడు, విజ్ఞానశాస్త్ర విదుడు
పరమశాంతుడు గురుజన భక్తియుతుడు
అతని యిల్లాలు విజయమ యార్యవినుత. 14

రామకృష్ణుఁడు చదువరి రమ్యగుణుఁడు
నమ్మువారల తలలోని నాల్కయుతఁడు
చాలనేర్పరి యగుకార్య సాధకుండు
బుద్ధియుతుడును, భక్తుఁడు పెద్దలందు. 15

అతని గృహలక్ష్మి సీతమ యనఘురాలు
భర్త కనుసన్న మెంఁగెడు పరమసాధ్వి
కష్టములయందు తనవారిఁ గాచునట్టి
సదయహృదయిని, కడుధీర, సాధుశీల. 16

అమలగుణుడు సీతారాముఁ డర్థవేత్త
బుద్ధిమంతుడు, విబుధుఁడు, బోధకుడును
శాంతచిత్తుడు, చదువరి, సజ్జనుండు
స్నేహలత వాని గేహిని స్నేహశీలి. 17

కీర్తికాముఁడు తాండవ కృష్ణుఁడతఁడు
వినయ భూషితుఁ డధికుడు విద్యలందు
అన్న లందఱు ప్రేమింతు రతని. సతపు
గారవమున సువర్చల కరముబట్టె. 18

అనువంశిక ధర్మంబు లాశ్రయించి
శౌచ మాచారమును గల్గు సాధుజనుడు
రామకృష్ణుఁడు దశరథ రామునందు
భక్తి గల్గుచు నిరతము భజన సేయు. 19

రామచంద్రుని కరుణచే వ్రాసె నిట్లు
తీయుతేనియ లొలికెడు తెలుఁగుబాస
కృష్ణుఁ డుపదేశ మిచ్చిన గీతములను
జగతి మెప్పించి సుగతికి జనెడు కోర్కె. 20



శ్రీకి యపరావతారమౌ సీత తోడ
నభయముద్రతో నాసీను డైన స్వామి
రామచంద్రుడు జగముల రక్షఁజేసి
వరము విచ్చుత భక్తుల వాంఛ దీర

# శ్రీ భగవద్గీత

## మొదటి అధ్యాయము

## అర్జున విషాదయోగము

ధృతరాష్ట్రుఁ డడుగుచున్నాడు:-

నాకుమారులు పాండుని నందనులును
చేయజనిరని యాకురుక్షేత్రమందు
నేమి చేసిరి ? సంగర మెటులజరిగె ?
వివరముగఁ దెల్పు సంజయ ! వినగవలదు 1

సంజయుఁ డనుచున్నాడు:-

యుద్ధ సన్నద్ధమై యున్న యోధవరులు
పాండు పుత్రుల చతురంగ బలములన్ని
వ్యూహముగనుండ జూచి సుయోధనుండు
గురుని జేరుచు పలికెను కురువిభుండ. 2

తమకు శిష్యుడౌ ద్రుపదుని తనయుచేత
యుద్ధ సన్నద్ధమై తీర్చి యున్న యట్టి
పాండుపుత్రుల వీరుల పరమబలుల
గురుబలంబును జూడుము గురువరేణ్య. 3

మీకు తెలిపెద పాండవానీకమందు
వీరవరులను విలుకాండ్ర వేరువేరు
భీము నర్జును సములును భీమబలులు
వీరులు ద్రుపద యుయుధాన విరటులరుగొ. 4

దృష్టకేతుఁడు వీరుఁడు దివ్యబలుఁడు
చేకితానుడు ఘనుఁడు కాశీవిభుండు
పురుజితుండును మఱి కుంతిభోజపతియు
పరమ వీరుడు శైబ్య నృపాలకుండు. 5

మహిత విక్రముడగు యుధామన్య నృపతి
వీరుఁడుత్తమౌజుండును విదితబలుఁడు
ద్రౌపదేయులు నా సుభద్రాసుతుండు
రణవిశారదులును మహారథులు వారు 6

సమరకోవిద ! యనఘ ! యాచార్యదేవ !
నాదు పక్షమునగల సేనాధిపతుల
వీరవరులను రథికుల విదితబలుల
నేర్పరించెద తెలియుంగ నిపుణ! మీకు.



కీర్తి ధనుఁడగు భీష్ముఁడు కృపుఁడు మీరు
దివ్యశరుఁడు కర్ణుఁడు సమితింజయుండు
సమర శూరుఁడశ్వత్థామ సౌమదత్తి
విదితబలుఁడు వికర్ణుఁడు వీరవరుఁడు. 8

శస్త్రవిదులును వీరులు సమరజయులు
యుద్ధకోవిదు లతిఘనుల్ యోధవరులు
నధిక సంఖ్యాకులేతెంచి రనికినిచట
విభుని కొఱకుగ ప్రాణముల్ వీడగలరు. 9

పరమవీరుఁడు భీష్ముచే పాలితమగు
కురు బలంబపరిమితంబు గురువరేణ్య!
బాహుబలుఁడగు భీముచే పాలితంబు
పాండుపుత్త్రుల వాహినీబలము చిన్న. 10

పరమవీరులు మనచమూపతులు మీర్ల
నియమితంబగు స్థలముల నిలచియుండి
మనదు సేనాని భీష్ముని మరువకుండ
రక్ష సేయంగ వలయును రణమునందు. 11

వృద్ధవీరుఁడు కౌరవవృద్ధుఁ డపుడు
గగనతలమున వ్యాపింప ఘననినదము
సింహనాదముచేసి తాచేతనున్న
శంఖమూదెను రారాజు సంతసింప. 12

వీరముప్పొంగ నూదిరి వీరవరులు
శంఖనాదాలు విపులాకసంబు నిండ
పణవ గోముఖ భేరులు బలసి మొరసె
నాద మంతట నిండెను నాల్గుదిశల. 13

తెల్లమావులు పూన్చిన తేరు నెక్కి
యనికి వచ్చిన ఘనులు కృష్ణార్జునులును
దిక్కులన్నిట నాదము పిక్కటిల్ల
దివ్యశంఖాలు పూరించి తేజరిలిరి. 14

పాంచజన్యంబు పూరించె పార్థసఖుఁడు
దేవదత్తంబు నూదెను దివ్యశరుఁడు
భీమకర్ముఁడు భీముఁడు భీతిగదుర
పౌండ్ర మూదెను దిక్కులు పగులునట్లు. 15

విజయశీలుఁడు ధర్ముఁడు వీరవరుఁడు
విజయశంఖమూదె ననంతవిజయమనగ
నకులసహదేవు లూదిరి నభమునిండ
పొల్పుగ సుఘోషమున్ మణిపుష్పకమును. 16

పరమ ధానుష్కుఁడౌ కాశిపతియు మఱియు
రధికవరుఁడు శిఖండి! విరాటరాజు
నపజయము లేని సాత్యకి యజ్ఞసూతి
యుద్ధవీరుఁడు తులలేని యోధవరుఁడు. 17

ద్రౌపదేయులు ద్రుపదుఁడు ధరణిపతులు
మహిత భుజుఁడగు ఘనుఁడభిమన్యుఁ డపుడ
వేరువేరుగ నూదిరి వీరవర్యులు
శంఖనాదాలు శత్రులు జలదరింప 18

శంఖనాదాలు తుములమై చదలు నిండె
మారుమ్రోగెను దిక్కులన్ మనుజనాథ
భీతి నెలకొనె కౌరవవీరులందు
ధార్తరాష్ట్రుల గుండెల ధైర్యమెడలె. 19

యుద్ధికి సన్నద్ధులైయున్న యోధవరుల
ధార్తరాష్ట్రుల గని కపిధ్వజుఁడు తనదు
గాండివంబును సారించి ఘనుఁడతండు
యాదవుంగని ధృతరాష్ట్ర యనియెనిట్లు. 20

అర్జునుఁడు పలుకుచున్నాఁడు:-

నారథము నిల్పుముభయ సేనలకు నడుమ
యుద్ధ మొనరింపవచ్చిన యోధులెవరొ
నాకు సరితూగు పర చమూనాథులెవరొ
వారి నొకపరి పరికింతు వాసుదేవ! 21

దుష్ట దుర్యోధనునకు సంతుష్టిజేయు
యుథికి సన్నద్ధులై యున్న యోధవరుల
చక్కఁజూచెద నిలుపుము సారసాక్ష !
తేరు నిరుసేన నడుమను దేవదేవ! 22

సంజయుఁడు పలుకుచున్నాఁడు:-

అర్జునుఁడు కోరినట్లుగ నచ్యుతుండు
భీష్మఁడాదిగ పరవీర పృథివిపతుల
కభిముఖముగాగ నడుమన నరదముంచి
"చూడుమర్జున ! శత్రుల శూరవరుల
ధార్తరాష్ట్రుల బలమున ధరణిపతుల"
ననుచు నుడివెను ధృతరాష్ట్ర ! యాదవుండు. 23

ఉభయ సేనలయందున్న యుర్వీపతుల
తాతతండ్రుల గురువుల మాతులులను
పుత్ర పౌత్రుల సఖులను భ్రాతృవరుల
శ్వశుర హితులను గాంచెను శౌరిసఖుఁడు. 24

యుధికి సన్నద్ధులై యున్న యోధవరుల
బంధుజనులను జూచుచు పార్థుఁడపుడు
మించు దయతోడ గుండె ద్రవించననియె
సారసాక్షున కిట్లు విచారపరత: 25

అర్జునుఁడనుచున్నాడు:-

యుధికి సన్నద్ధులై నిల్చి యున్నయట్టి
బంధులను జూడ గాత్రపు సంధులన్ని
విడులుచున్నవి, నోరును పిడచగట్టె
నదరుచుండె తనువు రోమహర్ష మొందె. 26

గాండీవము జారుచున్నది కరమునుండి
కాయు మందెల్ల శ్రీకృష్ణ ! కలిగె తపన
చక్క నిలుచుట కైనను శక్తి లేదు
మనము భ్రమియించుచున్నది మారజనక! 27

కష్టఫలములె మనకిట గలుగునట్లు
దుర్నిమిత్తము లెల్లెడ దోచుచుండె
స్వజనులగు వారి రణమున సంహరింప
కలుగు శ్రేయమదేమియొ గాంచనైతి 2:

జయము గోరను రణమున సారసాక్ష
రాజ్యభోగము లందనురక్తి లేదు
బంధునాశన మొనరింప వచ్చునట్టి
రాజ్యసుఖముల గోరంగరాదు కృష్ణ ! 29

ఎవరి సుఖముల కొరకునై యెపుడు మనము
కోరుచుందుము రాజ్యమా కులము వారు
తాతతండ్రులు గురువులు మాతులులును
శ్వశురులును పుత్రపౌత్రులు స్యాలకులును. 30

ధనము ప్రాణము విడువంగ దలచి వారు
యుద్ధ మొనరింప సిద్ధులై యున్నవారు
వారి చంపగ నెటులోర్తు వాసుదేవ !
వలదు రాజ్యము స్వర్గాధిపత్యమైన
చావ నొప్పుదు నే వారి చంపలేను. 31

ధార్తరాష్ట్రుల వధియింప దరికొనంగ
కలుగు సుఖమేమి కలదయ్య కమలనాభ
దుష్టవర్తనులైన యీ ధూర్త జనుల
జంపఁ గలుగదె పాపంబు సారసాక్ష ! 32

స్వజనులగు ధార్తరాష్ట్రుల జంపుకొనగ
నర్హులము గాము బంధులమైన మేము
బంధుజనులను జంపిన పరమపురుష !
యేమి సుఖములు కలుగునో యెఱుగరాదు. 33

రాజ్యలోభముచే ధృతరాష్ట్ర సుతులు
కులము నాశన మొనరింప కూడిరనికి
వంశనాశము జేయగ వచ్చునట్టి
కలుష మెఱుగరు ద్రోహులు కలుషమతులు. 34

వంశనాశము జేయగ వచ్చు ఫలము
నెఱిగి యుండియు రణము నేనెట్లుసేతు ?
స్వకుల రక్షణ సేయంగ సాధువంద్య ?
యుద్ధ మొనరింప కుండుట యుక్తమవదె. 35

వంశనాశము చేతనో వాసుదేవ !
అనువంశిక ధర్మంబు లంతరించు
ధర్మనాశము జరిగిన ధరణియందు
కుదురుకొను నధర్మంబది కులముపంచు. 36

ధర్మమనునది నశియింప ధరణియందు
కలుగు దుష్ప్రవర్తన కులకాంతలందు
దుష్టవనితలు ధరణి నుద్భూతమైన
వర్ణసంకర మేర్పడు వాసుదేవ ! 37

సంకరముచే నరకమగు పంకజాక్ష !
కులమువారికి కులఘాతకులకుగూడ
పిండదానముల్ తర్పణవిధులు లేక
పతితులగుదురు పితరులు పాపగతికి. 38

వర్ణసంకర కారకుల్ వంశనాశ
కర్తలగువారి పాపపు వర్తనమున
ధర పురాతనంబగు కులధర్మములును
జాతిధర్మముల్ నశియించు శాశ్వతముగ. 39

ధర్మము నశియించు కులఘాతకులచేత
ధర్మసంకర మేర్పడ ధరణిజనుల
కగును నరకము స్థిరముగ ననుచు నెపుడు
వినుచు నుందుముగాదె యో వృష్ణితిలక. 40

రాజ్యసుఖముల యందనురక్తి చేత
బంధుజనులను జంపంగ పాలుపడితి
వంశనాశము జేయగ వచ్చునఘము
లెఱిగియును జేయుటూనితి మెట్లు కృష్ణ ! 41

మించినదిలేదు శ్రీకృష్ణ ! కొంచమైన
శస్త్రములవీడి చేయును సమరమింక
నాయుధములేని నున్న నాసాయుధులగు
ధార్తరాష్ట్రులు జంపినన్ దానమేలు. 42

సంజయుఁడనుచున్నాడు:-

అనుచు పలుకుచు నర్జునుఁ డచ్యుతునకు
రణము చేయక నోధృతరాష్ట్ర ! తాను
చేతి ధనువును విడచుచు చింతతోడ
కూలబడియెను రథమున జాలిగొనుచు. 43

ఇది శ్రీరామచంద్ర కరుణా కటాక్షలబ్ధ కవితాచిత్ర,భార ద్వాజసగోత్ర,బృందావనాన్వయ సంజాత, నారాయణాచార్య పౌత్ర కృష్ణమాచార్యపుత్ర, బుధజనవిధేయ, రామకృష్ణమాచార్య ప్రణీతంబైన ఉపనిషత్సారమును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును కృష్ణార్జున సంవాదరూపమును నగు శ్రీ భగవద్గీతయందు అర్జున విషాదయోగమను మొదటి యధ్యాయమునకు ఆంధ్రపద్యానువాదము.

# శ్రీ భగవద్గీత

## రెండవ అధ్యాయము

## సాంఖ్య యోగము

సంజయుఁడనుచున్నాఁడు:-

బంధుజనులను చంపరగ బాధపడుచు
నక్షములనుండి జారగ నశ్రుచయము
సమర మొనరింప నేరక జాలిపడెడు
అర్జునున కిట్లు పలికె నా యచ్యుతుండు. 1

భగవానుఁడు పలుకుచున్నాఁడు;-

ఆర్యచరితము గాదిది యల్పబుద్ధి
క్లిష్టసమయమున నిది యకీర్తికరము
నిహము పరముల జెడగొట్టు నట్టి నీచ
దైన్యభావము నీకెట్లు దాపురించె. 2

శత్రుతాపన! నుడువకు షండునివలె
దైన్యభావము గొననీకు తగదు! పార్థ
జాలిగాదిది వ్యర్థమౌ బేలతనము
హృదయ దౌర్బల్యమును వీడి యుధికి లెమ్ము. 3

అర్జునుఁడనుచున్నాడు:-

మాననీయుఁడు భీష్ముండు మహితబలుఁడు
గురువు ద్రోణుఁడు వారిపై క్రూరనార
సంబుల వదలి ఘోరయుద్ధంబు నేను
చేయ పాడియ! తెల్పుమీ శీఘ్రగతిని. 4

క్రూరబుద్ధితో రణమున గురుల జంపి
రుధిరభోగంబు లాశించు రోతకంటె
కడగి వారికై రాజ్యభోగముల వదలి
బిచ్చమెత్తుక బ్రతుకుట పెద్దమేలు. 5

ఎవరి వధియించి జీవింప నిచ్ఛగించ
మట్టి భీష్మాదు లెదురయి రనికి నిచట
నెఱుగ నేర్తుమె విజయమ దేరి కగునొ?
వలదు బంధుల జంపగ వచ్చుజయము. 6

కృపణభావము నొందె నాకిపుడు మనము
జ్ఞానహీనుడనై నిన్ను నడుగుచుంటి
శ్రేయమగుదాని వివరించి చెప్పుమయ్య
శిష్యుడగుదును నన్ను శాసింపు మిపుడు. 7

లభ్యమగునట్టి భూలోక రాజ్యమైన
పావనంబగు స్వర్గాధిపత్యమైన
చిత్తపై కల్య మధికము జేయునట్టి
దుఃఖభారము తొలఁగంగ ద్రోయులేవు: 8

సంజయుఁడనుచున్నాడు;-

శత్రుతపనుఁడు పాండుని పుత్రుఁడట్లు
జేలతనమున సంగర విముఖుఁ డగుచు
నాలమును చేయలేనని యచ్యుతునకు
విన్నవించుచు రథమున మిన్నకుండె. 9

రెండుసేనల నడుమన రీతిదప్పి
వ్యసనపడుచున్న విజయుని పైపుజూచి
హాసమొనరించు నట్లుగ యాదవుండు
పలికె నీరీతి ధృతరాష్ట్ర! పార్ధునకును. 10

శ్రీకృష్ణుఁడనుచున్నాడు:

వగచుచుంటివి కూడని వారికొఱకు
పండితునివోలె ధర్మముల్ పలికెదీవు
చన్నపోయిన వారికై యుర్వియందు
పండితులు చింతనొందరు పార్ధ! యెపుడు. 11

నేను నీరాజలోకము నీవుగూడ
నుండియుంటిమి పూర్వము నుంటిమిపుఁడు
నుందు మికముందు నెపుఁడు లేకుండబోము
వ్యర్థ దైన్యము నీకేల పార్థ ! యిట్లు. 12

దేహి యేరీతి లౌకిక దేహమందు
బాల్య యౌవన కౌమార వార్థకముల
పొందు; నారీతి దేహము నొందు వేరు
ధీరుఁ డిసుమంత వగవడు దీనినెఱిగి. 13

ఇంద్రియ విషయ సంయోగ మేర్పడంగ
కలుగు శీతోష్ణ సుఖదుఃఖములును పార్థ !
శాశ్వతములు గావివియేవి క్షణికమగును
వానినన్నిటి సహియింప వలయు పార్థ. 14

కలుగు శీతోష్ణ సుఖదుఃఖములకు సతము
సమత గల్గుచు దృఢమానసంబు గల్గు
ధీరు నెవనినీ స్పర్శ బాధింపకుండు
నట్టి పురుషుఁడు ముక్తికి నర్హుఁడగును. 15

లేనిదానికి నునికియు లేనె లేదు
ఉన్న దానికి నునికి లేకుండ బోదు
సత్యమగు నాత్మ దేహమ సత్యమనియు
తత్త్వవేత్తలు మాత్రమె తలచగలరు. 16

జగతి యంతయు వ్యాపించు సత్యమైన
యాత్మ కెపుడు నాశనము లేదంచు నెఱుగు
మవ్యయంబగు నట్టి యా యాత్మ నెపుడు
నంత మొందింప జాలిన యర్హుఁడెవఁడు? 17

అప్రమేయుఁడు నిత్యుఁడు నవ్యయుఁడగు
నాత్మ నాశములేని వాఁడనుచు నెఱుగు
దేహి శాశ్వత మంతము దేహములకె
సిద్ధుడవు గమ్ము నీవిక యుద్ధమునకు. 18

ఆత్మ నెవ్వడు తలచును హంత యంచు
హతము నగునని భావించు నాత్మనెవఁడు
వారలిర్వురు నెఱుఁగరు వాస్తవమును
చంపునదియు గాదాత్మ తా చంపబడదు. 19

ఆత్మ పుట్టదు గిట్టదా యాత్మయెపుఁడు
నుండి యొకయెప్డు మరల లేకుండఁ బోదు
ఆత్మ నిత్యము శాశ్వత మాది యౌను
అంతరించును దేహమా యాత్మకాదు. 20

ఆత్మ యవినాశి యజమును నంతరహిత
మవ్యయంబును శాశ్వత మంచు పార్థ !
యెఱుఁగు వాఁడిల నితరుల నెట్లు చంపు ?
నెట్లు చంపించు ? నితరుల నెపుడు తాను. 21

జీర్ణవస్త్రము లూడిచి చీర నవము
దాల్చుచుండును నరుడెట్లు తనువు నందు
నంతమనునది లేని యీ యాత్మయట్లు
శిథిలదేహము విడచుచు చేరు నవము. 22

ఆయుధములేవి ఛేదింప వాత్మ నెపుడు
నగ్ని దహియింప నేరదా యాత్మ నెపుడు
తడుపజాలవు జలములు తలచ నాత్మ
మఱియు శోషింపబడ దాత్మ మరుతుచేత. 23

ఛేద్యమును గాదు, దహనము చేయబడదు
తడుపబడదది శోషింపబడదు పార్థ!
నిత్యమగు నాత్మ యంతట నిండియుండు
నచల మవికార మాదియు నై నదాత్మ. 24

వ్యక్తమవ దాత్మ యూహింప వలనుపడదు
చేష్ట లెరుగనిదది యంచు చెప్పబడును
ఆత్మతత్త్వము తెల్పితి నాత్మగొనుము
దూరమొనరింపు మికనీవు దుఃఖభరము. 25

పుట్టుచుండును సతతము గిట్టుచుండు
నంచు నాత్మను నీవు భావించితేని
చావుపుట్టుక లెపుడును సహజమగుట
తగదు చింతింప నీరీతి దగదుపార్థ! 26

పుట్టు ప్రతిజీవి తప్పదు గిట్టకెపుడు
గిట్టు ప్రతిజీవి మరల తా పుట్టుచుండు
చావు పుట్టులు సహజమౌ జగతిలోన
దాని కొఱకుగ చింతింప దగదు పార్థ! 27

పుట్టుటకు పూర్వమీ జీవు లెట్టివగునో
గిట్టినంతన వీనికి నెట్టిగతియొ
మధ్యకాలాన ప్రత్యక్షమౌను మనకు
స్థిరము లేనట్టి వానికై చింతయేల. 28

కొందరాశ్చర్యమునఁ జూచుచుందు రాత్మ
కొందఱాశ్చర్యమున పల్కుచుందు రాత్మ
కొందఱాశ్చర్యమున వినుచుందు రాత్మ
వినియొ నెవ్వగరు తత్త్వము విజయ! వారు. 29

జగతి వ్యాపించి యున్నట్టి సర్వ జీవ
దేహమందును నెలకొన్న దేహియెపుడు
శాశ్వతుడ వధ్యుడగు ధనంజయుఁడ! కాన
జీవజాలము కొఱకుగ చింతగొనకు: 30

ఆత్మధర్మము పాటించియైన నీవు
సమర మొనరింప నీరీతి జంకుగొనకు
ధర్మయుద్ధము చేయుటె ధర్మమగును
క్షత్రియున కింక వేరొండు జగతి లేదు: 31

ధర్మ సంగ్రామ మొనరించు ధరణిపునకు
దేవనగరపు ద్వారముల్ తెరువబడును
ధర్మయుద్ధము నొనరింప దగినయట్టి
సదవకాశము ధన్యము క్షత్రియునకు. 32

ధర్మయుద్ధము చేయక తప్పితేని
స్వకులధర్మము విడచిన వాఁడవగుదు
కీర్తి తొలగును నీకపకీర్తి కలుఁగు
పాప మొదవును దానిచే పార్థ ! నీకు. 33

అవ్యయంబగు నట్టినీ యపయశస్సు
చెప్పుకొందురు జనములు చిరముపార్థ !
మానధనునకు కరమవమాన మగుట
మరణమున కంటె హీనము మహిని పార్థ ! 34

నిన్ను మన్నించు రథికులు నేడు నీవు
భయముచేతను రణమునఁ బాఱితనుచు
చులకనగ జూతు రిట్టి నీ చొప్పుగాంచి
ఇంతకంటెను హీన మింకేమి గలదు ? 35

సత్త్వహీనుఁడ వంచుదునిన్ సర్వరిపులు
పల్కుదు రనేకములగు దుర్భాషణములు
ధరణి నినుబోటి పరవీర తాపనునకు
నింతకంటెను హీన మింకేమి గలదు ? 36

సమరమున జచ్చి గొనవచ్చు స్వర్గసుఖము
రణము గెల్చిన కల్గును రాజ్యసుఖము
రెంట నేదైన యర్జున ! శ్రేయమగునుఁ
గాన స్థిరముగ ననిజేయుఁ గడగుమింక. 37

జయము, లాభనష్టము లపజయములన్ని
సుఖము దుఃఖము నొకటను చూపుగల్గి
క్షత్రధర్మము చేయుము సమరమీవు
ఫలితమేదైనఁ గలుగదు పాపమీకు. 38

సాంఖ్యయోగపు తత్త్వము చాలవరకు
వివరణము జేసినాడను విజయ ! నీకు
యుక్తి వివరింతు నికమీద యోగబుద్ధి
కర్మబంధాలు ఛేదింప గలదు పార్థ ! 39

కర్మయోగము పాటింప గలిగితేని
అంతకంతకు ఫలితము నందగలవు
నడుమ విడచిన దోషము నందబోవు
పాపగలదది సంసారభయము నుండి. 40

కర్మయోగము పాటింపగలుగు కొఱకు
పార్థ ! చిత్తంబు నేకాగ్రపరచ వలయు
బుద్ధి నేకాగ్రపరచని పుడమిజనుల
బుద్ధులవి బహురీతులు పొందుచుండు. 41

శబ్దజాలము చేతనె చతురులగుచు
వేదవాదరతులగుచు విజయ ! నాక
సుఖము కంటెను నితరము శూన్యమనుచు
కొంద ఱజ్ఞులు వాదించుచుందు రెపుడు. 42

కామ వాసనల్ ప్రబలము కాగ వారు
స్వర్గసుఖముల నమితమౌ వాంఛగల్గి
కర్మలెన్నియొ చేయంగ గడగుచుంద్రు
జననమరణపు గతులకు జనుచునుంద్రు. 43

విషయసుఖముల వాంఛలు విడువలేక
భోగములు గోరు వారికి బుద్ధి యెపుడు
పలువిధంబుల పరుగిడు పార్థ ! వారి
బుద్ధి యేకాగ్రనిష్ఠను పొందదెపుడు. 44

వేదములు తెల్పు త్రిగుణాత్మ విషయములను
త్రిగుణవాంఛల వీడుచు తేజరిలుము
ద్వంద్వముల వీడి క్షేమ మావలకు ద్రోచి
ఆత్మజ్ఞానము గలవాడ వగుము పార్థ ! 45

అన్ని యెడలను జలమయ మైనయప్డు
బావితోడను బనియేమి పార్థ ! మనకు
నన్నితావుల పరమాత్మ నరయునపుడు
వేదములతోడఁ బనియేమి విజ్ఞునకును. 46

కర్మ లొనరించు స్వేచ్ఛయె గలదు నీకు
ఫలము గోరెడు నధికార బలములేదు
కాన యర్జున ! కోరకు కర్మఫలము
కర్మచేయక యుండుట ధర్మమవదు
కర్మరాహిత్యమును గొనగాదు విజయ ! 47

సిద్ధ్యసిద్ధ్యు లందును సమబుద్ధి నుంట
యోగమనబడు; ఫల్గుణ ! యోగనిష్ఠఁ
గర్మఫలముల యందీవు కాంక్షగొనక
నిత్యకర్మల నన్నిటి నిర్వహింపు: 48

కడు విశుద్ధమౌ నిష్కామ కర్మకంటె
కామ్యకర్మము నీచము గాన పార్థ !
కమ్ము స్థిరుడవు నీవు నిష్కామకర్మ
పరమ లుబ్ధులు ఫలముల బడయుసెంత్రు 49

చిత్త శుద్ధుఁడు సుకృత దుష్కృతములన్ని
విడువ గలడిట నిహమున విజయ ! కాన
బుద్ధియోగము గొననీవు సిద్ధపడుము
కలుగు యోగము కర్మలఁ గౌశలమున. 50

బుద్ధిమంతులు నిష్కామ బుద్ధిచేత
కర్మఫలముల యందలి కాంక్షవీడి
దురిత సంసార బంధముల్ తొలగి వారు
చింతలెఱుగని పదవిని చేరగలరు. 51

సర్వ విషయములందు నాసక్తి వదలి
యుద్ధవీరుఁడ! విజయ! నీబుద్ధి యెపుడు
మోహకాలుష్యములనుండి ముక్తి వడయు
నపుడు నీవింక వైరాగ్య మందగలవు. 52

వివిధ విషయముల్ వినుటచే వికలమైన
నీదు మనమెప్డు స్థిరముగ నిలచియుండు
మరలకుండగ జ్ఞానసమాధి యందు
నపుడు నీవిక యోగము నందగలవు. 53

అర్జునుఁడడుగుచున్నాడు:-

తత్త్వ మెఱిగిన ప్రాజ్ఞుని తత్త్వమేది?
ఎట్లు వర్తించు? కర్మల నెట్లు చేయు?
నెట్లు పలుకును? నిష్ఠయు నెట్టిదగును?
వివరముగ నాకు వినిపింపు వృష్ణితిలక! 54

భగవానుఁడుపలుకుచున్నాడు:-

ఆత్మగతములైన సమస్త కామములను
విజయ! యత్నము చేతను విడచుజనుఁడు
ఆత్మసంతుష్టి నిరతము ననుభవించు
నట్టి ధీశాలి ప్రాజ్ఞుడౌ నంచు తెలియు. 55

కష్టముల యందు నెప్పుడు కలత పడక
భోగముల యందు నుబ్బును పొందకుండ
భయము, రాగము, క్రోధమున్ వదలినట్టి
మననశీలుడు మునియని యనగబరగు. 56

సర్వ విషయము లందునాసక్తి వదలి
శుభములకు తుష్టి గొనక నశుభములందు
దిగులు జెందక యుండెడు ధీరుడైన
వాని జ్ఞానము స్థిరమగు పార్థ వినుము. 57

కూర్మ మంగముల ముడుచుకొనిన యట్లు
విషయవాంఛల నుండి సర్వేంద్రియముల
మరల జేయును స్థిరముగ మనుజుఁడెవడు
వాని జ్ఞానము స్థిరమగు పార్థ! నిజము. 58

పురుషుఁ డుపవాసముల నెంతొ పొసగజేసి
మనము విషయవాంఛల నుండి మరలజేయు
నాత్మవిజ్ఞాన మలవడి నంతవాఁడు
విషయసుఖముల పూర్తిగ విడువగలడు. 59

మననశీలుఁడౌ విద్వాంసు మనముఁగూడ
నిశ్చయంబుగ హరియించు నింద్రియములు
మరలకుండగ నాయందె మనమునిలిపి
స్థిరత నుండెడు వాఁడగు స్థిమితబుద్ధి. 60.

విషయ చింతనచే నగు విషయరక్తి
విషయరక్తిచే గల్గును విషయకాంక్ష
కాంక్ష పెరిగిన క్రోధము కలుగుచుండు
క్రోధఫలితము మోహము కొనలువేయు. 61

మోహగుణము స్మృతిభ్రంశ మొదవజేయు
స్మృతియు భ్రంశము చెందుటచేత విజయ!
బుద్ధి నశియించు కౌంతేయ! బుద్ధిచెడిన
పురుషుఁడెప్పుడు నాశము పొందుచుండు. 62

ఆత్మసంయమబుద్ధి తా నాత్మవశత
నింద్రియంబుల నన్నిటి నిరవుకొలిపి
విషయసుఖముల పొందెడు వీతరాగి
చిత్తశాంతిని పొందును చింతలేక. 63

మనము నిర్మలమైనట్టి మానవునకు
సర్వదుఃఖముల్ నశియించు; శాంతిగలుగు
సర్వ దుఃఖవిముక్తుడౌ శాంతచిత్తు
బుద్ధి సుస్థిర భావంబు పొందుచుండు. 64

నిగ్రహము లేక కలుగదు నియమబుద్ధి
నిగ్రహములేక కలుగదు నిర్మలాత్మ
ఆత్మభావము లేకేడ నాత్మశాంతి?
చిత్తశాంతము లేకున్న చెడునుసుఖము. 65

పెద్దనావను పెనుగాలి పేరుదధిలో
నిచ్చవచ్చిన రీతిగ పుచ్చునట్లు
మనము నింద్రియ వశమున మసలెనేని
యాత్మ విజ్ఞాన మంతయు హరణమగు

నిక్కమగు నీవిషయముల నెఱిగి పార్థ
సర్వమగు నింద్రియంబుల చక్కబట్టి
విషయవాసన యందుతా విముఖుడగు
నుండువానికి బుద్ధియు నుండు స్థిరత

ఆత్మవిజ్ఞాన శూన్యున కైనరాత్రి
ఆత్మవిజ్ఞాన వంతున కగునుపగలు
ఆత్మవిజ్ఞాన శూన్యున కైపగలు
ఆత్మవిజ్ఞానవంతున కదియు రాత్రి..

నిత్యము నదీజలములచే నిండుచుండి.
యుదధి నిరతము నొకరీతి నుండునట్లు
విషయసుఖములు పైకొన్న విముఖుండ
స్థిరత నుండెడు వాడొందు చిత్తశాంతి.

విషయవాంఛల నన్నిటి విడచిపుచ్చి
మమతలన్నిటి ద్రోలి మనమునుండి
అహమనెడు దుర్వికారము నధిగమించి
సంచరించెడు వాడొందు శాంతి విజయ

పరమదివ్యము పార్థ యీ బ్రహ్మనిష్ఠ
మునుగ డిదిగల్గు నరుడిల మోహమందు
మరణకాలాన కైననీ మంచినిష్ఠ
పొందగల్గిన మోక్షము నందునరుడు.

ఇది శ్రీరామచంద్ర కరుణాకటాక్షలబ్ధ కవితాచిత్ర భారద్వాజసగోత్ర, బృందావనాన్వయసంజాత, నారాయణాచార్య పౌత్ర, కృష్ణమాచార్య పుత్ర, బుధజనవిధేయ, రామకృష్ణమాచార్య ప్రణీతంబైన, ఉపనిషత్సారమును, బ్రహ్మవిద్యయు,యోగశాస్త్రమును కృష్ణార్జున సంవాద రూపమునునగు శ్రీ భగవద్గీత నందుసాంఖ్యయోగమను రెండవయధ్యాయమునకు ఆంధ్ర పద్యానువాదము.



# శ్రీ భగవద్గీత

## మూఁడవ అధ్యాయము

## కర్మయోగము

అర్జునుఁడనుచున్నాఁడు:–

యోగముల యందు నా కర్మయోగమునకు
మించినది జ్ఞానమంచు భావించితేని
దురితమగు యుద్ధకర్మకు దొరకొనుమని
చొక్క నన్నేల నియమించు చుంటివీవు. 1

మిశ్రమగు వాక్యములచేత మిగ్గులనన్ను
కలత నొందించుచుంటివి కమలనాభ !
నీవ యీరెండు తెఱగుల నిశ్చయించి
శ్రేయమగు మార్గమేదియొ చెప్పుకృష్ణ ! 2

భగవానుఁడనుచున్నాడు;-

పుడమి జనులకు పరమును పొందదగిన
ద్వివిధ నిష్ఠలు నాచేత దృష్టమయ్యె
జ్ఞానయోగము తగునది సాంఖ్యులకును
యోగమార్గము తగు కర్మయోగులకును. 3

కర్మ లాచరింపగ లేని కర్మయోగి
పడయనేరడు నిష్కామ ఫలితములను
జ్ఞానయోగపు గమ్యనౌ జ్ఞానసిద్ధి
కర్మసన్న్యాసము వలన కలుగదెపుడు. 4

చెల్లదెవడును కర్మలు చేయకుండ
కర్మ లొనరింప కుంటయు కష్టమగును
ప్రకృతిగుణముల కనువుగ పార్థ! మనుజు
డస్వతంత్రుడై కర్మల నాచరించు 5

వాక్పదము, పాణి, పాయు వుపస్థలనగ
నన్ని యింద్రియ కర్మల నణచియుంచి
మదిని విషయవాసన లన్ని మననజేయు
మూఢబుద్ధి గలుగువాడు మోసగాడు. 6

మనసు జ్ఞానేంద్రియంబుల మదమణంచి
అన్నియెడలను కర్మేంద్రియముల చేత
కర్మ లొనరించు నిష్కామ కర్మయోగి
చిత్తశుద్ధిని బొంది తా శ్రేష్టు డగును. 7

కర్మ విముఖత నొందుటకన్న విహిత
కర్మ లొనరించు చుంటచే గలుగు శుభము
నియత కర్మము లొనరించు నీవుపార్థ !
కర్మహీనత జీవింప కష్టమౌను.  8

యజ్ఞకర్మలు గాకుండ నన్యమైన
కర్మబంధము నరునిల గట్టివైచు
యజ్ఞకర్మలు మోక్షార్హ మగును పార్థ !
ముక్తసంగుడవై కర్మ మొనరజేయుము.  9

బ్రహ్మ యజ్ఞము తోడుగా ప్రజసృజించి
"యజ్ఞయాగాది క్రతువుల వృద్ధిగనుడు
కామగవి వోలె యజ్ఞము గాచుమిమ్ము
వాంచితముదీరు మీ" కని వాకొనియెను.  10

"తృప్తి పరచుడు క్రతువుల దేవతలను
దేవగణములు మిమ్మును దృప్తి పఱచు
వారు మీరును తృప్తిని బడయుచుండి
పరమ మభివృద్ధి గాంచుడు ప్రజలుమీరు"  11

తృప్తి పరచినఁ గ్రతువుల దేవతలను
వరములిత్తురు వారును వరదులగుట
దేవదత్తముల్ తిరిగి యా దేవతలకు
నర్పణము చేయకను చోరుడౌను వాఁడు.  12

యజ్ఞశేషము భుజియించు యతులు సతము
పాపములనుండి ముక్తిని బడయుగలరు
ఆత్మభోగము కొఱకుగ నన్నముఁ దిని
పాపి పొందును మఱికొంత పాపఫలము. 13

ప్రాణు లన్నము వలననె ప్రభవమొందు
కలుగు నన్నము పుడమికి ఘనమునుండి
ఘనము లొదవును యజ్ఞము లొనరజేయ
కర్మములచేత యజ్ఞము గలుగుచుండు. 14

కర్మలవి బ్రహ్మమందుండి గల్గుపార్థ!
ప్రభవమొందును వేదము బ్రహ్మవలన
సత్యమైనట్టి బ్రహ్మము సర్వగతము
యజ్ఞమందును బ్రహ్మము న్యాసమయ్యె. 15

నరుడెవండీ జగచ్చక్ర సరణిగనడు
బ్రతుకు నింద్రియలోలుడై పాపివాఁడు
ఆత్మ నాసక్తి, సంతుష్టి, యాత్మతృప్తి
గల్గు నరునకు బనిలేదు కర్మలందు. 16

భూతముల నాశ్రయింపడు ముక్తజీవి
స్వార్థ మనునది లేకుండు పార్థ! వాఁడు
కర్మకరణము, మఱియు నకర్మతయును
వాని రెండిట బనిలేదు వానికెపుడు. 17

సాక్షిభూతుఁడవై ఫలాపేక్ష లేక
నియతకర్మము లొనరింపు నీవు పార్థ!
కర్మబద్ధుడు గాకుండ కర్మజేయు
పురుషుఁడెపుడును పరమును బొందుచుండు. 18

కర్మబద్ధులు గాకుండ కర్మజేసి
జనకుఁడాదిగ గల్గు రాజర్షులెల్ల
పొందగలిగిరి చివరకు పూర్ణసిద్ధి
కానఁ దగునయ్య నిష్కామకర్మఁ జేయ. 19

శ్రేష్ఠుఁడగు జనుండే కర్మ చేయుచుండు
దాన చేయుంగఁ దలతురు తక్కజనులు
నుత్తముఁడు గొను నేమార్గ ముత్తమముగ
ననుసరించెద రెల్లరు నట్టిదాని. 20

కర్మ లొనరింప మూడులోకముల యందు
లేవు; పొందదగినదియు లేదు నాకు
పొందబడనిది నాకింక ముందె లేదు
కాని వర్తించుచుందును కర్మయందె. 21

ఇంచుకైన జాగ్రత నే వహించనేని
కొలది కర్మల నొనరింప కుంటినేని
యనుసరింతురు నారీతి జనులుకూడ
కర్మహీనత జెడుదురు సర్వజనులు. 22

కొలది కర్మల నొనరింప కుంటినేని
యనుసరింతురు నారీతి జనులుకూడ
కర్మహీనత సంకర కర్త నగుదు
కర్మహీనత జననాశ కర్త నగుదు. 23

జ్ఞానహీనులు మిగుల నజ్ఞానవశత
కర్మఫలముల నాశించి కర్మగొంద్రు
జ్ఞానివంతులు తారు విజ్ఞానులౌట
కర్మఫలముల గోరక కర్మగొంద్రు. 24

బద్ధకర్ములౌ మూఢుల బుద్ధికెపుడు
జ్ఞాని కల్గింపగూడదు చాపలమును
సర్వకర్మలు చేయుచు. సర్వజనులు
నాచరించెడు నట్లుగ నడుపవలయు. 25

అహము కల్గిన యజ్ఞాని యహరహంబు
ప్రకృతిగుణముల కనువుగ బ్రతుకునందు
కర్మ లొనరించు చుండును; కర్మలన్ని
చేయుకర్త ను, నేనని చింతజేయు. 26

అహము లేనట్టి విజ్ఞాని యహరహంబు
ప్రకృతి గుణముల కనువుగ బ్రతుకునందు
కర్మ లొనరించు చుండియు; కర్మ
చేయు కర్త ను నేనని చింతగొన 27



ప్రకృతి గుణముల మూఢమౌ ప్రకృతినంది
ప్రకృతి గుణకర్మ లందున బద్ధుఁగుచు
సంచరించెడు నజ్ఞాన జనులబుద్ధి
చలన మొందింప గూడదు జ్ఞాని యెపుడు. 28

ఆత్మ విజ్ఞాన మంది నీ వాశ వీడి
సర్వకర్మల నాయందు సన్న్యసించి
మమత గొనకుండ నిశ్చల మనముతోడ
యుద్ధ మొనరింప పార్ధ! సన్నద్ధుడగుము. 29

సుంతయైన నసూయకు చెంతఁబోక
శ్రద్ధగల్గుచు సూక్తుల బద్ధుడగుచు
నేను నుడివిన విధముగ నెవడునడచు
కర్మబంధముల్ తొలగంగ గలఁడు వాఁడు. 30

నేను చెప్పిన రీతిగ నిత్యమందు
సంచరింపక యుండెడు జనుఁడు వాఁడు
జ్ఞానహీనుఁడు మూఢుఁడు జగతియందు
చెడును తప్పక నాయెడ చింతలేక. 31

భూతజాలములు ప్రకృతి బుద్ధిగొనును
జ్ఞాని యైనను నెంత సుజ్ఞానియైన
ప్రకృతి గుణముల కనువుగ బ్రతుకుజగతి
ప్రకృతి గుణముల న్నిగ్రహం బాపగలదె ? 32

ఇంద్రియాధీన విషయమం దింద్రియములు
రాగరోషము లొందును రాగవశత
రాగరోషవశుం డవరాదు జనుఁడు
వ: ఖ్యశత్రువు లివియె ముముక్షునకును. 33

పరమమైనట్టి పరధర్మ పరతకన్న
నాత్మధర్మము గుణహీన మైనమేలు
ఆత్మధర్మము నందంతమగుట మేలు
పరుల ధర్మము లొనరింప భయముకలుగు. 34

అర్జునుఁడను చున్నాడు!-

దేన ప్రోత్సాహమంది యీ దీనజనుఁడు
బలయుతంబుగ నియమింప బడినయట్లు
నిష్టపూర్తిగ గాకున్న నిచ్ఛగొనుచు
పాపకర్మల నొనరించి పాపియగును. 35

భగవానుఁడు పలుకుచున్నాడు:-

కామమది రజంబువలన ఁగలుగుచుండు
కామ విఫలతన్ క్రోధము గలుగుచుండు
కామ మెఱుగదు తృప్తిని కడునుపాపి
పరమశత్రువు కామము పార్థ ! నిజము. 36

వహ్ని ధూమముచే కప్పు వడినయట్లు
మలిన మాదర్శము నెటుల మైలపరచు
గర్భశిశువును మావియు కప్పునెట్లు
కామమనునది జ్ఞానమున్ కప్పునట్లు. 37

నింప నెంతయత్నించిన నిండదెపుడు
నగ్నివలె నెంత దిన్నను నాకలిడదు
కామరూపము కామము కఠినవైరి
జ్ఞానమును కప్పియుంచు విజ్ఞానికెపుడు. 38

ఇంద్రియంబులు బుద్ధి చిత్తేంద్రియమును
నాశ్రయములు కామంబున కంచునుండు
రట్టి కామము జ్ఞానము నావరించి
మానవుని మోహపరచుచు మతినిజెఱచు. 39

ఇంద్రియంబుల నన్నిటి నిరవుపరచి
జ్ఞాన విజ్ఞానముల రెంటి నాశమునకు
కారణంబగు కడుపాపి కామగుణముఁ
విడుము యత్నముచేసైన విజయ ! నీవు. 40

దేహమునకన్న శ్రేష్ఠ మింద్రియములగును
ఇంద్రియములకు మిన్న చిత్తేంద్రియంబు
మనముకంటెను శ్రేష్ఠమౌ మంచిబుద్ధి
బుద్ధికంటెను శ్రేష్ఠత పొందు నాత్మ. 41

ఆత్మ మిన్నయౌ బుద్ధికి నంచునెఱిఁగి
ఆత్మ నిశ్చల మొనరించి యాత్మచేత
కామరూపపు దుష్టమౌ కఠినవైరిఁ
జంప యత్నింపు కౌంతేయ ! జయముపొందు. 42

ఇది శ్రీరామచంద్ర కరుణాకటాక్షలబ్ధ కవితాచిత్ర భారద్వాజసగోత్ర, బృందావనాన్వయసంజాత, నారాయణాచార్య పౌత్ర, కృష్ణమాచార్య పుత్ర, బుధజనవిధేయ, రామకృష్ణమాచార్య ప్రణీతంబైన, ఉపనిషత్సారమును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును కృష్ణార్జున సంవాద రూపమునునగు శ్రీ భగవద్గీతయందు కర్మయోగమను మూడవయధ్యాయమునకు ఆంధ్ర పద్యానువాదము.

# శ్రీ భగవద్గీత

## నాల్గవ అధ్యాయము

## జ్ఞాన యోగము

భగవానుఁడనుచున్నాఁడు:-

అవ్యయంబగు నీయోగ మర్కునకు
ప్రోక్తమైనది నాచేత పూర్వమెప్డొ
ఇనుడు నుపదేశమిచ్చె నామనువుకొఱకు
మనువు నిక్ష్వాకునకు తాను మరలఁజెప్పె. 1

పార్థ ! వంశానుగతముగ వచ్చినట్టి
రాజయోగము నెఱిగిరి రాజఋషులు
కాల మెంతయొ పూర్వము గడచుకతన
మరపునకు వచ్చె నీయోగమంత పార్థ ! 2

రాజగుహ్యము సెంతొ పురాతనంబు
పరమయోగంబు; నాయందు పార్థ ! నీవు
పరమభక్తియు మైత్రియు బడయుకతన
నీకు నుపదేశ మిచ్చితి నిట్టివిద్య. 3

అర్జునుండడుగుచున్నాడు:

సూర్యుజన్మము నీకెంతొ పూర్వమగును
నిన్న మొన్నటిదే గదా నీదుజన్మ
పూర్వ మెప్పుడొ యున్నట్టి సూర్యుకొఱకు
దీని నుపదేశ మిచ్చు టదెట్లు పొసగు. 4

భగవానుండనుచున్నాడు;–

ఎన్ని జన్మల నందితి వీవు పార్థ !
ఎన్ని జన్మల నందితి నేనుగూడ
వానినన్నిటి నెఱుగుదున్ పార్థ ! నేను !
వాని నెఱుగ వీవు నరుండ వగుటవలన. 5

అజుడ నౌదును నే నౌదు నవ్యయుడను
పార్థ ! భూతకోటికి నేన భర్త నౌదు
నాత్మభావము నేనెపు డాశ్రయించి
అవతరించుచు నుండెద నాత్మమాయ. 6

ధర్మమునకు హాని మఱి యధర్మమునకు
జయము గల్గుచు నుండునీ జగతినెపుడు
ధర్మసంస్థాపనము జేయ ధరణియందు
నవతరించెద నపుడెల్ల నన్ని యెడల. 7

సాధుజనులకు పరిరక్ష సలుపుకొఱకు
దుష్టజనముల నెల్లను దునుముకొఱకు
ధర్మమనునది స్థాపింప ధరణియందు
నన్ని యుగముల యందు నే నవతరింతు. 8

కడగి దివ్యమౌ నా జన్మ కర్మములను
దివ్యజ్ఞానము చేతను తెలియునెవడు
జనన దేహము విడి పునర్జన్మలేక
చేరు నాయందె వాఁడెట్టి చింతలేక. 9

వీతభయులయి రాగంబు విడచిపుచ్చి
ఆత్మశుద్ధితో పరము నన్నాశ్రయించి
జ్ఞానతపమును జేసిన జ్ఞానులెల్ల
పూతమనమున మోక్షము పొందగనిరి. 10

నన్ను నెవరెవ రేరీతి నాశ్రయింత్రు
వారి కారీతి నేనును వశుడనగుదు
మనుజు లెల్ల రు నాదగు మార్గమందె
అనుసరించుచు నుండెద రన్నియెడల. 11

దివ్యఫలముల గోరుచు దేవతలను
పూజ చేయుచు నుందురు పుడమిజనులు
కర్మఫలములు శీఘ్రమె కలుగుచుండు
మనుజలోకము నందున మానవులకు. 12

వర్ణములు నాల్గు సృజియింప బడియె నెపుడొ
వ్యక్తి గుణకర్మముల రెంటి వలన విజయు !
వర్ణసృష్టికి విభజన కర్తనైన
అవ్యయుడ నెఱుగు మకర్త నంచు నన్ను. 13

అంటనేరవు కర్మము లంచునన్ను
కర్మఫలములు నాకెప్డు కాంక్షగలుగ
దనుచు నెఱిగిన పరిశుద్ధ మనుజుడెపుడు
కర్మబంధాల చేత తా కట్టు వడడు. 14

కర్మతత్త్వము నెఱిగియె కర్మగొనిరి
మందుకాలము నందు ముముక్షువులును
పూర్వు లగువారు వారికి ముందువారు
చేసియున్నట్లె కర్మల చేయుమీవు. 15

కర్మ మననేది ? యేది యకర్మమనగ ?
ననుచు సందియ మొందుదు రాత్మవిదులు
కర్మపరమగు జ్ఞానము కలుగునట్లు
నుడివెదను; కర్మమోక్షము నందగలవు. 16

కర్మలను గూర్చి మఱియు వికర్మగూర్చి
కర్మరాహిత్య మనెడు నకర్మం గూర్చి
తెలిసికొనవలె పార్థ ! యీతెఱగులన్ని
కర్మతత్త్వము తెలియంగ కష్టమౌను. 17

పార్థ ! కర్మ నెవ డకర్మ భావమొందు
నెవ డకర్మలన్ కర్మలం చెఱుఁగుచుండు
బుద్ధిమంతుడు వాఁడగు పుడమిజనుల
సర్వకర్మల నొనరించు సాధుపగును. 18

కామరహితుఁడై ప్రారంభ కరుఁడగుచు
తనదు కర్మల జ్ఞానాగ్ని దగ్ధపరచి
చిత్త శుద్ధితొ కర్మల జేయు నెవ్వ
డట్టి వానిని పండితుఁడంద్రు బుధులు. 19

కర్మఫలముల యందలి కాంక్షవీడి
తృష్ణ యెఱుగక నిత్యంబు తృప్తుఁడగుచు
నితరు లెవ్వరి తా నాశ్రయింపకుండి
కర్మ వర్తనముండియు కాడు కర్త. 20

ఆశ వీడుచు తా నియతాత్ము డగుచు
నెవరినుండియు నాశతో నేమిగొనక
జీవయాత్రికు తగు కర్మ చేయు వాఁడు
పుణ్య పాపపు ఫలములు పొందబోడు. 21

దొరకినంతటితోనె తా తుష్టుడగుచు
ద్వంద్వముల వీడి గొనకుండ వైరబుద్ధి
సిద్ధ్య సిద్ధులందును సమబుద్ధి నుండి
కర్మబద్ధుఁడు గాడిల కర్మజేసి. 22

ముక్తసంగుడై కాంక్షల ముక్తుఁడగుచు
నాత్మ జ్ఞానము నందె తా నాత్మ నిలిపి
భగవదర్థము గావించు భక్తజనుని
కర్మలన్నియు నశియించు; కలుగుముక్తి  23

అర్పణము బ్రహ్మ మతియును హవియు బ్రహ్మ
బ్రహ్మమగు నగ్ని హుతమును బ్రహ్మమగును
బ్రహ్మమగు హోత్ర యజ్ఞము బ్రహ్మమగును
బ్రహ్మనిష్ఠుని గతియును బ్రహ్మమగును.  24

అన్యు లిల దేవపూజలె యజ్ఞమనుచు
దేవతల పూజ సేతురు దివ్యనిష్ఠ
బ్రహ్మనిష్ఠులు బ్రహ్మాగ్ని బ్రహ్మనిష్ఠ
యజ్ఞకర్మల జేతురు యజ్ఞమందె.  25

ఇతరయోగులు వారి జ్ఞానేంద్రియముల
సంయమాగ్నుల నాహుతి సలుపుచుంద్రు
కొంద ఱితరులు శబ్దాది గుణములన్ని
ఇంద్రియాగ్నుల నాహుతి నిడుచునుంద్రు.  26

ఇంద్రియంబుల కర్మల నితరజనులు
ప్రాణకర్మము లనుచును బరగువాని
జ్ఞానమను దానిచేత బ్రజ్వలిత మైన
ఆత్మ సంయమ యోగాగ్ని నాహుతింత్రు.  27

ద్రవ్యయజ్ఞము జేతురు దివ్యబుద్ధి
యజ్ఞ భావనచే తపోయజ్ఞములను
యోగయజ్ఞము జేతురు యోగనిష్ఠ
జ్ఞానయజ్ఞము జేతురు జ్ఞానపరత. 28

వేదముల నభ్యసించుచు విధియుతముగ
యజ్ఞ మొనరింతురి స్వాధ్యాయ యజ్ఞ నగ
యజ్ఞపరత జేతు రనేక యజ్ఞములను
నియమబద్ధులై యోగులు నిష్ఠతోడ 29

పరులు తాము ప్రాణాయామ పరులు నగుచు
ప్రాణము హుతము జేతు రపానమందు
ప్రాణ మందున వేల్తు రపానములను
పరులు బంధింతు ప్రాణమపానములను. 30

పరిమితాహార నియుతులు పరులు తారు
ప్రాణము లయింప జూతురు ప్రాణమందె
వెత్త లగుదురు యజ్ఞపు విధులవీరు
పాపముల నెల్ల యజ్ఞాల బాపుకొందురు. 31

యజ్ఞశేషాన్న భుజు లెవరగుచునుందురు
పడయుదురు వారు శాశ్వత బ్రహ్మపదము
యజ్ఞహీనున కిహలోక యాత్రలేదు
పడయు నేరీతి పరలోక పథముపార్థ : 32

వివిధమగు యజ్ఞవిధులవి వేదమందు
నుడువబడియుండె పార్థ ! నే నుడివితిపుడు
కర్మజనితము లా యజ్ఞ కర్మలన్ని
యంచు నెఱిగిన మోక్షము నందగలవు. 33

యజ్ఞములయందు నా ద్రవ్యయజ్ఞములకు
జ్ఞానయజ్ఞమె శ్రేష్ఠము జగతియందు
సర్వకర్మలు చివరకు జ్ఞానమందె
పరిసమాప్తము చెందును పార్థ ! యెపుడు. 34

తత్త్వదర్శను లధ్యాత్మ తత్త్వవిదులు
జ్ఞాన ముపదేశ మిత్తురా జ్ఞానమీవు
వినతి జేసియు నదనున పృచ్ఛజేసి
గురువులకు సేవజేసియు గొనుము పార్థ ! 35

విద్య దేనిచే మోహంబు వీడగలవొ
భూతసంఘము నీయందు బొసగగనుదొ
భూతముల నట్లె నాయందు బొందజూతొ
అట్టి జ్ఞానము వడయు మో యనఘ ! నీవు. 36

పాపులందఱి కంటెను పార్థ ! నీవు
పాప మొనరించి మిక్కిలి పాపి[illegible] న
పరమ విజ్ఞాన మనియెడు పడవచేత
పార మొనరింప గలవయ్యు పాపజలధి. 37.

జ్వలితమగు నగ్ని దహియించు సమిధలెట్లు
కర్మలన్నిట జ్ఞానాగ్ని కాల్చునట్లు
జ్ఞానసదృశం బగునది యీ జగతిలేదు
కాలవశమున పొందును కర్మయోగి. 38

ఇంద్రియంబుల చక్కగ నిరవుపరచి
శ్రద్ధగల్గిన వానికి జ్ఞానమబ్బు
నేకనిష్ఠతో జ్ఞానము నెఱుగువాఁడు
పడయు గలడతి శీఘ్రమె పరమశాంతి. 39

జ్ఞానరహితుఁడు శ్రద్ధయు లేనివాఁడు
సంశయాత్మకుడెపుడు నాశనము పొందు
సంశయాత్మున కిహలోక సౌఖ్యములును
కలుగ; వా పర సుఖములు కలుగవెపుడు. 40

కర్మలన్నిటి నిష్కామ కర్మగొనుచు
సన్న్యసించుచు; విజ్ఞాన శస్త్రధార
సంశయంబుల ఛేదించు జనుఁడెవండు
వాని చుట్టవు కర్మలన్ బంధనములు 41

కలిగి యజ్ఞానమున బుద్ధిఁ గలచుచున్న
సంశయంబుల విజ్ఞాన శస్త్రధార
ఛేద మొనరించు మికలెమ్ము చింతవీడి
నిర్మలంబగు కర్తవ్యనిష్ఠ గొనుము. 42

ఇది శ్రీరామచంద్ర కరుణాకటాక్షలబ్ధ కవితాచిత్ర భారద్వాజసగోత్ర, బృందావనాన్వయసంజాత, నారాయణాచార్య పౌత్ర, కృష్ణమాచార్య పుత్ర, బుధజనవిధేయ, రామకృష్ణమాచార్య ప్రణీతంబైన, ఉపనిషత్సారమును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును కృష్ణార్జున సంవాద రూపమునునగు శ్రీ భగవద్గీతయందు జ్ఞాన యోగమను నాల్గవ యధ్యాయమునకు ఆంధ్ర పద్యానువాదము.

—(0)—

# శ్రీ భగవద్గీత

## ఐదవ అధ్యాయము

## కర్మ సన్న్యాస యోగము

అర్జునుఁడడుగుచున్నాడు:-

కర్మ సన్న్యాస ముత్తమ కర్మమనుచు
మరల కర్మయోగమె శ్రేష్ఠ మనెదవీవు
రెంట నొకదాని మిక్కిలి శ్రేయమనుచు
నిశ్చయంబుగ తెల్పుము నీరజాక్ష ! 1

భగవానుఁడు పలుకుచున్నాడు:-

కర్మసన్న్యాసము మఱి నిష్కామకర్మ
రెండు కలిగించు చుండును శ్రేయములను
కర్మసన్న్యాసయోగము కంటె పార్థ !
కర్మయోగమె శ్రేష్ఠతఁ గలిగియుండు. 2

ద్వేషభావము రాగమున్ వీడు నెవఁడు
నిత్యసన్న్యాసి యనివాని నెఱిగికొనుము
ద్వంద్వభావము లేకుండు వాఁడు కర్మ
బంధము లనుండి ముక్తిని బడయు పార్థ ! 3

జ్ఞాన కర్మలు వేరని జ్ఞానశూన్యు
లందు రారెండు వేరని యనరు బుధులు
రెంట నొకదాని సక్రమ రీతి చేసి
పడయ వచ్చును రెండిటి ఫలము పార్థ ! 4

సాంఖ్యయోగులు జనుదురే స్థానమునకు
కర్మయోగుల కయ్యదె కలుగుచుండు
జ్ఞానకర్మము లొకటిగ జనుఁడెవండు
తలచు; వాడగు నిజమగు తత్త్వవిదుఁడు. 5

జ్ఞానయోగము వడయంగఁ జగతిపార్థ !
కర్మ యోగాచరణ లేక కష్టమగును.
కర్మ మందున కడునిష్ఠ గలుగు మునియు
బ్రహ్మపదమును శీఘ్రమే పడయఁగలడు. 6

సర్వ భూతాత్మ తనయాత్మ సమము గనుచు
నింద్రియజయము విజిత చిత్తేంద్రియమును
గల్గి యాత్మశుద్ధుండైన కర్మయోగి
కర్మజేసియు కర్మల cగట్టువడడు. 7

వినుచు చూచుచు గొనుచును వివిధరుచుల
నిశ్వసించుచు నడచుచు నిద్రగొనుచు
కనులుమూయుచు తెఱచుచు ఘ్రాణగొనుచు
మాటలాడుచు విడచుచు మలినములను. 8

ఇంద్రియములన్ని తమతమ యింద్రియార్థ
విషయముల యందు వర్తించు వేరుగాదు
చేయునది నేనుగాదని చిత్తమందు
తత్త్వవిదుడైన యోగి తా తలచుచుండు. 9

కర్మలన్ని బ్రహ్మార్పణకాగజేసి
సంగముల వీడి కర్మల సలుపువాడు
నలినపత్రము నీటిచే నంటనట్లు
పాపముల చేత తా నంటబడడు పార్థ ! 10

మనసుచేతను తనువున మనముచేత
నితర మేఱుగక కేవల మింద్రియముల
నాత్మ పరిశుద్ధి కొఱకునై యాశవిడచి
యుక్త కర్మల నొనరిత్రు యోగులెపుడు. 11

కర్మఫలముల గోరక కర్మజేసి
పరమ శాంతిని పొందును పార్థ ! యోగి
కర్మ నిష్ఠుఁడు గాకున్న కామవశత
ఫలము గోరుచు పొందును బంధనములు. 12

సర్వకర్మల నాత్మచే సన్న్యసించి
కర్మ చేయక చేయింప కర్త గాక
వాకిళులు తొమ్మిది గలట్టి పట్టణమున
చేరి సుఖముగ నివసించు జీవియెపుడు. 13

కర్మ కర్తృత్వమును గాని కర్మగాని
కర్మఫలముల యందలి కాంక్షగాని
సృష్టిచేయడు జగమున సృష్టికర్త
ప్రకృతివశమున నన్నియు పనులుజరుగు. 14

పరమపురుషుఁడు గొనడేరి పాపములను
పుణ్యఫలముల గొనడట్లు పురుషుఁడెపుఁడు
జ్ఞాన మంతటి నజ్ఞాన మావరింప
మునుగుచుందురు జీవులు మోహమందు. 15

జ్ఞానమును కప్పియుంచు నజ్ఞాన మెవరి
యాత్మవిజ్ఞాన బలమున నంత మొందు
నట్టి వారికి జ్ఞానమె యర్కుభాతి
పరమపురుషుని ప్రత్యక్షపరచు చుండు 16

ఆత్మ; బుద్ధియు, పరమాత్మయందె నిలిపి
యాత్మనిష్ఠయు తత్పరాయణత కల్గి
జ్ఞాన నిర్ధూతకల్మషుఁడైన యోగి
పరమపదమగు మోక్షమున్ బడయుగలఁడు 17

వినయమున భూషితంబగు విద్యగల గు
విప్రునందును, గవులను, వేదజముల
చుల్కనౌ శ్వప చ్చండాల శునకులందు
సమత గల్గుచు నుందురు సాధుజనులు. 18

సమత యన్నింట గల్గిన జనుఁడిహమున
జన్మ సంసార బంధ విజయము గాంచు
దోష రహితము బ్రహ్మమ తుల్యమగును
దోషరహితులు బ్రహ్మ మందుండ గలరుః 19

బ్రహ్మభావము పొందిన బ్రహ్మవిదుఁడు
కలిగి స్థిరబుద్ధి యవివేకి గాక యెపుఁడు
ప్రియము కలిగిన వేళల ప్రీతిగొనడు
బేలతనమును పొంద డప్రియములందు. 20

బాహ్య సుఖములం దాసక్తి బాసి మనుజుఁ
డాంతరంగిక సుఖము నెట్లంద గలుగు
బ్రహ్మపరమైన స్థిరబుద్ధి బడసివాడు
నక్షయంబగు సుఖము నట్లంద గలఁడు. 21

వస్తువిషయాల సంయోగ వశత గలుగు
బాహ్యసుఖములు దుఃఖమున్ బడయజేయు
నట్టి వాద్యంతవంతము లగుటవలన
బుధులు సుఖముల నాసక్తి బొందరెపుఁడు. 22

పుడమి దేహమోక్షమునకు పూర్వమెవఁడు
కామ రోష వేగము నరికట్ట గలుగు
నతఁడె యాత్మసంయమము గల్గిట్టియోగి
వాఁడె సుఖమంద గల్గును పార్థ! నిజము. 23

ఆత్మ నెపడిల సుఖముల ననుభవించు
నంతరారాము డెవడగు నాత్మనెవఁడు
ఆత్మతేజమందగలుగు; నట్టియోగి
బ్రహ్మభూతుడై పొందును బ్రహ్మపదము. 24

ద్వంద్వభావము విడచిన వారలగుచు
భూతహితమును గోరెడు బుద్ధిగల్గి
యఘవిదూరులు నియతాత్ము లైన ఋషులు
బ్రహ్మసాయుజ్యమును పొందు పార్థ! యెపుడు. 25

కామరోషము లందున కట్టుపడక
నియమనిష్ఠల మనమును నియతపరచి
ఆత్మతత్త్వము తెలిసిన యతులకెపుఁడు
బ్రహ్మసాయుజ్య మంతట బర్వుచుండు. 26

బాహ్య శబ్దాది విషయముల్ బాహ్యపరచి
దృష్టి భ్రూమధ్యమందున దిటవుపఱచి
నాసికా రంధ్రముల వెంట నడచునట్టి
ప్రాణమునపానమును సమపరచుకొనుచు. 27

భయము, క్రోధము, వాంఛలు బడయ కెపుడు
చిత్త, బుద్ధుల నియతము జేసి సతము
నన్య మెఱుగక మోక్షమం దాస్థ గల్గు
మననశీలుండు ముక్తుఁడౌ మహిని సతము. 28

యజ్ఞ తపముల భోక్త నేనగుదు ననుచు
సర్వలోకేశ్వరుఁడ నంచు, శాశ్వతుండను
భూతహితుఁడను నేనను బుద్ధిగలిగి
**సతము వర్తించు వాఁడిల శాంతిబొందు.** 29

ఇది శ్రీరామచంద్ర కరుణా కటాక్షలబ్ధ కవితాచిత్ర, భారద్వాజసగోత్ర, బృందావనాన్వయసంజాత నారాయణాచార్య పౌత్ర, కృష్ణమాచార్యపుత్ర బుధజనవిధేయ రామకృష్ణమాచార్య ప్రణీతంబైన ఉపనిషత్సారమును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును శ్రీ కృష్ణార్జున సంవాదరూపమునగు శ్రీ భగవద్గీతయందు కర్మ సన్న్యాసయోగమను ఐదవ యధ్యాయమునకు ఆంధ్రపద్యానువాదము.

—0—

# శ్రీ భగవద్గీత

## ఆరవ అధ్యాయము

## ఆత్మసంయమ యోగము

భగవానుఁడు పలుకుచున్నాడు :-

కర్మఫలముల గోరక కడగి యెపుడు
నియత కర్మల నొనరించు నెవఁడు? వాఁడు
కర్మసన్న్యాసి; యోగియు; కర్మరహిత
నగ్ని వ్రేల్చని వాఁడు సన్న్యాసి కాడు. 1

దేని సన్న్యాస మందురు, దానినీవు
యోగ మనుచును తెలియుము యుద్ధవీర!
విషయవాసన లందాస్థ విడక నెవఁడు
యోగి కాజాల డెపుడును, యుక్తు డవడు. 2

జ్ఞానయోగము నారోహణంబు జేయు
మునికి కార్యకరణ చాల ముఖ్యమగును.
యోగసిద్ధిని బడసిన యోగికెపుడు
శాంతి మోక్షమునకు ముఖ్య సాధనంబు 3

ఇంద్రియార్థములం దెవు డిచ్ఛ గొనక
కర్మముల యందు సతమును కాంక్ష గొనక
సర్వ సంకల్పములు వీడు సాధకుండు
అమృత యోగసిద్ధిని పొందె ననగ వచ్చు. 4

ఆత్మ నుద్ధరించగ నగు నాత్మచేత
నాత్మ నాశము జేయ రాదాత్మచేత
నాత్మ బంధువు తానె యౌ నాత్మ కెపుడు
నాత్మ శత్రువు తానగు నాత్మ యెపుడు. 5

ఆత్మ విజయము గొను నెవడాత్మ చేత
వాని కాత్మయె తానాత్మ బంధువగును
ఆత్మ విజయము గొనడెవ డాత్మచేత
నాత్మ శత్రువు వానికా యాత్మ యెపుడు. 6

చిత్త జయమొందు శాంతుని చిత్తమందు
నాంతరంగికుడగు పరమాత్మ యెపుడు.
వాఁడు శీతోష్ణ సుఖదుఃఖ ద్వంద్వములను
మానమవమానము గను సమాన దృష్టి. 7

జ్ఞాన విజ్ఞానముల చేత నాత్మతృప్తి
నిర్వికారత, యింద్రియ నిగ్రహంబు
కలిగి సమదృష్టి లోష్టాశ్మ కాంచనముల
యోగనిష్ఠను గొనువాఁడె యోగియగును. 8

మిత్రుల, సుహృద; మధ్యస్థ శత్రులందు
బంధుజనులం దుదాసీనులందు ద్వేష్యు
లందు! సాధుల, పాపుల యందు నెపుడు
సమత గనువాడె శ్రేష్టుడు జగతియందు. 9

నియత చిత్తము నింద్రియ నిగ్రహంబు
కలిగి; సంగ్రహము వదలి కాంక్షవీడి
సాధకుం డొంటి నొంటరి స్థలము నందు
మనము నొనరింప వలె ధ్యాన మగ్నమవగ. 10

నాతి నీచము మఱియు నున్నతముగాని
యాసనమునుంచి శుచియగు దేశమందు.
దాని నంబరాజిన కుశోత్తరము జేసి
స్థిరముగను నిల్పి దాని నస్థిరత లేక. 11

అందు కూర్చుండి మనము నేకాగ్రపరచి
కడగి చిత్తేంద్రియంబుల గతులు మాన్పి
యాత్మశుద్ధికై పరమాత్ము నాత్మనిల్పి
యోగసాధన జేయఁగ యుక్తమగును. 12

తనువు, కంఠము, శిరమును సనువు పడగ
నిశ్చలము సమమును గాగ నిల్పి, స్థిరత
నాసికాగ్రమునసె దృష్టి నమరనిల్పి
దిక్కులను గూడ జూడక ధీరబుద్ధిఁ. 13

శాంతచిత్తుడై తా బ్రహ్మచారి యగుచు
భయము వీడుచు, మనమును బద్ధపరచి
మనము నాయందె నిల్పుచు మరలకుండ
చిత్తనియతితో ధ్యానంబు చేయువలయు. 14

నియతమానసుఁడగు యోగి నిరతముగను
మనము ధ్యానము నందె తా మరలు కొలిపి
మోక్ష పర్యవసానమున్ మద్గతంబు
శాశ్వతంబగు చిత్తోప శాంతిపొందు. 15

అమితభోజునకు కలుగ దట్టి సిద్ధి
యశన హీనత నసలది యనువు పడదు
నిష్ఠ చేకుర దత్యంత నిద్రకునకు
జ్ఞానయోగము రాదతి జాగ్రతునకు. 16

అశననియమము యుక్త విహారములును
యుక్త కర్మము లందును యుక్త చేష్ట
యుక్త జాగ్రత మఱియును యుక్త నిద్ర
యున్న వానికి సులభము యోగసిద్ధి. 17

నియతచిత్తము నెపుడాత్మ నిలిపియుంచి
విషయసుఖముల నన్నిటి విడచిపుచ్చి
యుక్తుఁడగు వాఁడు బరగును యోగియనుచు
సాధనము చేత నిట్టిది సాధ్యమగును. 18

చిత్తనియతితో సాధన జేయునట్టి
ధ్యానయోగి మనము పోల్చదగును పార్థ
గాలి చొరకుండు స్థలమున కదలకుండ
నిశ్చలత నుండు దీపపు నిశ్చలతకు. 19

నియమ నిష్ఠల మనమును నిగ్రహించి
పురుషుఁ డెవడిల యుపరతి పొందుచుండు
నాత్మ జూచును నా పరమాత్మ నాత
డాత్మ యందున సంతోష మందుచుండు. 20

ఏది యింద్రియముల చేత నెఱుకపడక
నంత మెఱుగక, బుద్ధిచే నవగతమగు
నట్టి దివ్యసుఖ మెఱుంగు నట్టి జనుడు
తొలఁగడెపుడును తత్త్వపు త్రోవనుండి 21

ఆత్మ సుఖలాభ మందిన యాత్మయోగి
అన్యలాభము లేవియు నధికములని
తలచ డెపుడును మనమున; దానిచేత
నధిక దుఃఖము లందు తా నచలు డగుచు. 22

దుఃఖ సంబంధముల నుండి దూరమైన
దాని యోగసంజ్ఞిత మని తలపవలయు
విషయ సుఖముల యెడ చిత్త విముఃఖత గొని
పూని సాధించి యోగము పొందవలయు. 23

చిత్త గతులచే నిరతమున్ జెలగుసట్టి
విషయ వాంఛల నన్నిటి విడచిపెట్టి
వివిధ విషయాల నుండి సర్వేంద్రియముల
మనము చేతనె చక్కగా మరలుకొల్పి. 24

తివిరి గొనుచును యోగి తా ధీరబుద్ధి
వశము గానీక మనమును వాసనలకు
నాత్మ లగ్నము జేయుచు నాత్మయందె
యభ్యసింపగ వలయు నా యాత్మశక్తి. 25

అస్థిరంబును చంచలమైన మనము
విషయ సుఖముల దగిలెడు వేళలందు
మరులు గొనకుండ దిటవుగ మరలజేసి
యాత్మవశము చేయగవలె నాత్మయందె. 26

సాధనము చేత పొంది ప్రశాంత మనము
సతము రజమను గుణమును సమయజేసి
బ్రహ్మ భూతుండు నగుచును పాపిగాని
పురుషునకు సుఖము తనంత పొందుచుండు. 27

పైన తెల్పిన సాధన పరతుండగుచు
నాత్మ లగ్నము జేయుచు నాత్మనెపుడు
పాపరహితుండు, శాంతుడున్ బ్రహ్మభావుం
డైన యోగి బ్రహ్మానంద మందగలడు. 28

యోగసాధన జేసిన యోగి యెపుడు
నాత్మ నన్ని భూతములందు! నాత్మయందు
నఖిల భూతజాలంబుల నరయగలండు
సమము గనుచుండు నన్నిటి జగతినతండు. 29

అన్ని జీవుల నెవడిల నన్ను జూచు
భూత సంఘము నాయందు బొసగజూచు
నట్టివానిని నేనెపు డరయు చుందు
వీడ డతండునన్ నే వాని వీడనెపుడు. 30

జీవులన్నిటి యందు వసించు నన్ను
చిత్త శుద్ధితో నెవడు భజించుచుండు
నాత్మలన్నిటి నొకటిగ నాత్మదలచు
నట్టి సర్వవర్తనున కే నాలయమును, 31

సుఖము తనకెట్లు? యితరుల సుఖము నట్లు
దుఃఖమనునది యితరుల దుఃఖమట్లు
సతము గనుచుండు నా యోగ సాధకుండు,
యోగులందఱ శ్రేష్ఠుడౌ యోగియగును. 32

అర్జునుఁ డనుచున్నాడు:-

ఆత్మ సామ్యము గలదంచు నాత్మయందు
నీవు నుడివిన యోగము నేను వింటి
చిత్త మతి చంచలం బౌట జేసి దేవ !
నిశ్చలంబగు యోగంబు నిలచు టెట్లు! 33

చిత్త మెప్పుడు చపలము, స్థిరము గాదు
మరలజేయ నశక్యము మానవునకు
వాయు వెపుడు నివర్తింప బడని యట్లు
మనము నిగ్రహించుట కష్టమౌను దేవ ! 34

భగవానుఁ డనుచున్నాడు:-

చంచలము మన మందు సంశయము లేదు
మనము నిగ్రహించుట కష్టమగును నిజము
పార్థ ! యభ్యాస, వైరాగ్య పరత జేసి
నిగ్రహింపగ వచ్చును నిశ్చయముగ. 35

మనము నిగ్రహింపగ లేని మానవునకు
జ్ఞానయోగము పొందుట సాధ్యపడదు
నియమ నిష్ఠల మనమును నిగ్రహించి
సాధనము జేయు నతనికె సాధ్యమగును. 36

అర్జునుఁ డడుగుచున్నాడు:-

శ్రద్ధ గల్గియు మిక్కిలి చపలమైన
మనము నిగ్రహింపగ లేని మానవుండు
జ్ఞాన సంసిద్ధి బడయక జగతియందు
నెట్టి గతిపొందు తెల్పుము కృష్ణ ! నాకు. 37

సిద్ధి బొందఁగఁ దగినట్టి స్థిరతలేక
కర్మ మార్గము నందును గదలలేక
సుఖ యసుఃను వీడి నశియింప కుండుటెట్లు ! .
గాలి తాకిడి చెదిరిన ఘనము వోలె. 38

సందియంబుల దీర్పంగ జాలినట్టి
యర్హుడవు నీవు, జలజాక్ష ? యమరవంద్య !
దివ్యుడవు నీవు గాక సందేహములను
బాప నీకంటె నధికులు పరులు గలరె ? 39

భగవానుఁడు పలుకుచున్నాడు :-
యోగపతితుఁడు తా నిహలోక మందు
పరమునందును దుఃర్గతిఁ బడయుడెపుడు
మంచి కార్యము నందుండ మంచిగాక
దురిత మొందునె?, కలుగునె? దుష్టగతియు 40

పుణ్యకర్ముల లోకము పొంది; యోగ
పతితుఁడు బహుకాల మచట వాసముండి
సంపదలు గల్గు నున్నతాచారపరుల
పుణ్యగేహము లందు తా బుట్టు మరల. 41

కాక, పుట్టును యోగుల గర్భమందు
నిట్టి జన్మము దుర్లభమెపుడు జగతి
పుట్టి గతజన్మ వాసనల్ పొందుచుండు
సిద్ధి బడయుగ నతడు సంసిద్ధు డగును. 42

(శ్లో 42-43)

యోగపతితుఁడు విషయ సంయుక్తుఁడైన
పూర్వ జన్మపు వాసనల్ పొందియుపుడు
యోగనిష్ఠకు బొల్పడు; యోగ మొనర
జేయ దలచుచు బ్రహ్మము జేరుచుండు. 43

యోగ మందగ యత్నించు యోగి యెపుడు
బహుళ జన్మల సంస్కారబలము చేత
సిద్ధి పొందును; పాప సంశుద్ధుఁడగుచు
పరమ పదమగు మోక్షంబు బడయుగలడు. 44

జ్ఞానజనుల కంటెను తపో జనులకంటె
వేద విహితములగు కర్మ విదుల కంటె
ధ్యానయోగియె మిన్నయౌ గాన నీవు
ధ్యానయోగివి గమ్ము విజ్ఞాని వగుచు. 45

ఇట్టి యోగులందఱి కంటె నెవడు నన్ను
శ్రద్ధ భక్తులు గల్గుచు సిద్ధి కొరకు
మనము నందు నిలిపికొని మననజేయు
యోగులందఱ మిన్నయౌ యోగివాఁడు. 46

ఇది శ్రీరామచంద్ర కరుణా కటాక్షలబ్ధకవితాచిత్ర, భారద్వాజసగోత్ర, బృందావనాన్వయసంజాత, నారాయణాచార్య పౌత్ర కృష్ణమాచార్యపుత్ర, బుధజనవిధేయ, రామకృష్ణమాచార్య ప్రణీతంబైన ఉపనిషత్సారమును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును, కృష్ణార్జున సంవాదరూపమును నగు శ్రీభగవద్గీతయందు ఆత్మసంయమయోగమను ఆఱవ అధ్యాయమునకు ఆంధ్ర పద్యానువాదము.

# శ్రీ భగవద్గీత

## ఏడవ అధ్యాయము

## విజ్ఞాన యోగము

భగవానుండనుచున్నాడు :-
మనము నాయందె నిల్పుచు మరలకుండ
నాశ్రయించుచు నన్, యోగమభ్యసించి
పూర్ణుడగు నన్ను తెలియుచు, పొందు విధము
వినుము వివరించెదను నీకు విజయ! యిపుడు 1

ఏది తెలిసిన మీద నికేమి లేదు
తెలియ దగునది; దానిని తెల్పుదిపుడు
స్వానుభవమును శాస్త్రవిజ్ఞానములును
శేషరహితము గాగ నే చెప్పుచుంటి 2

మనుజకోటిలో నేయొక్క మానవుండొ
యోగసిద్ధికి తా యోగ యుక్తుఁడగును
సిద్ధి పొందిన వారలన్, శుద్ధుఁడైన
నెవడొ యొక్కఁడె నిజముగ నెఱుఁగునన్ను. 3

ఆకసంబును, వాయువు, వగ్ని, జలము
పుడమియును, మనంబును, మరి బుద్ధి యహము
ననుచు పార్థ! యపరమను నాదుప్రకృతి
యష్ట విధముల విభజన మయ్యె వినుము. 4

పైన తెల్పిన ప్రకృతి యపరము; పరము
దాని కంటెను శ్రేష్ఠమౌ; దాని వినుము
ప్రాణభూతముపై యది బరగుచుండు
జగతి వంతయు దాన నిశ్చలతఁ దాల్తు. 5

జగతి వసియించు నీ జీవ జాలములును
ప్రకృతి నుండియె పుట్టును పార్థ! తెలియు
జగతి యుత్పత్తి కారణ జనుఁడ నేన. 6

వివిధ కర్మము లొనరింతు విజయ! జగతి
శ్రేష్ఠమైనది నాకంటె సృష్టిలేదు
కొలికి పూసలు సూత్రాన కూడినట్లు
జీవజాలము నాయందె చేరియుండు. 7

జలము లందలి రుచియును, చంద్ర సూర్య
కాంతి; వేదములందు నోంకారములును
నాకసమునందు శబ్దము నౌమ నేనె
నరుల పురుషకారమును నేనౌదు పార్థ! 8

పుణ్యగంధము నేనౌదు పుడమియందు
నగ్ని యందలి తేజంబు నౌదు నేన
జీవజాలము నందలి జీవమేన
తాపసులయందు నేనౌదు తపము పార్థ! 9

భూతగణమున కుత్పత్తి హేతువైన
అదిబీజము నేనౌదు నంచు తెలియు
బుద్ధిమంతుల యందలి బుద్ధినేనె
తేజవంతుల నౌదునే తేజగుణము. 10

కలను బలశాలు రందున కామరాగ
వర్జితంబగు దృఢమగు బలమునగుచు
వివిధజీవులకును విధివిహితమైన
ధర్మబద్ధమౌ కామము తలపనేన. 11

సాత్త్వికములు, రాజసభావ చయము; తామ
సంబులు కలుగు నావల్ల సవ్యసాచి!
అన్ని నాయందె నుండిన నంచు నెఱుగు
నేను వానిట లేకుందు నిశ్చయముగ. 12

పార్థ! త్రివిధగుణముల భావముల చేత
మనుజ లోకము మోహిత మగుటవలన
మూఁడుగుణములు పొందని మూలపురుషుఁ
డవ్యయుండగు వరము నన్నరయలేదు. 13

త్రిగుణ మయమగు నా మాయ దివ్యమగుట
ధరణిజనులకు నెవరికి దాటరాదు
ఎవఁడు ననుగోరి శరణగు నెపుడు నన్ను
వాఁడు నామాయ తరియించువాఁడు పార్థ! 14

బుద్ధిహీనత నాసురబుద్ధి గొనుచు
దురిత కర్మము లొనరించు దుష్టజనులు
మాయచేతను జ్ఞానము మాయమగుట
పడయ జాల రెపుడు నను పార్థ! వారు. 15

అర్థకాంక్షులు, జిజ్ఞాసు లార్తులు మఱి
జ్ఞానులను నాల్గు విధముల జనులు పార్థ!
పుణ్యకర్ములు, వారు నన్ పొందగోరి
పూజ లొనరించు చుందురు పుడమియందు. 16

నిత్యయుక్తుడై కల్గుట నేకభక్తి
నాల్గువిధముల భక్తులన్ జ్ఞానిమిన్న
పరమమిష్టుడన్ జ్ఞానికి పార్థ! నేను
నాకు నత్యంత ప్రియుడగు జ్ఞాని యెపుడు. 17

భక్తులందఱు శ్రేష్ఠులే భరతవీర!
జ్ఞాని నారూప మగునని నా మతంబు
చిత్త మెప్పుడు నాయందె జేర్చి, నన్నె
పరమపదముగ దలచును పార్థ! వాఁడు. 18

జన్మ లెన్నియొ గడచిన జ్ఞాని యొకఁడె
వాసుదేవ మయమగు నీవస్తుజగతి
యంచు తెలిసిన కడపట నాయందు జేరు
నట్టి సుజనుఁడు దుర్లభుఁ డగును పార్థ! 19

ఆత్మ భావాపహృత బుద్ధులైన వారు
కామవాసనల్ ప్రేరణ కలుగ జేయ
దేవతానుభావ నియమ దీక్షగొనుచు
నన్యదేవతా రాధన లాచరింత్రు. 20

ఏ ఫలము గోరి సద్భక్తుఁ డెపుడు నెవరిఁ
బూజ సేయంగ నిచ్చను బొందుచుండు
నా ఫలము పొంద భక్తుని కతని యందె
నిశ్చలంబగు శ్రద్ధను నేన జేతు. 21

భక్తియును శ్రద్ధ గల్గుచు భక్తుఁడెపుడు
నన్య దేవతారాధన లాచరించి
వివిధపూజల నాచేత విహితమైన
వాంఛితము లెల్ల బడయును వాఁడు పార్థ! 22

అన్య దేవతారాధన లాచరించు
యల్పబుద్ధుల కగుఫల మల్పమగును
అన్య పూజల జేరుదు రన్యులందె
నన్ను పూజించు వారలు నన్నె పొందు. 23

నాశరహిత ముత్తమమైన నాదు భావ
మెఱుగ జాలరు మందు లే, మెఱుక లేక
చక్షురాదీంద్రియముల గోచరము గాని
నన్ను తమవలె నెంతురు నరుడటంచు. 24

అధిక యోగమాయా వృతుడైన నేను
జనుల కెవరికి నెపుడు గోచరుఁడ గాను
ఆత్మవిజ్ఞాన శూన్యులీ యవనిజనులు
నే నజుడ నవ్యయుడ నంచు నెఱుఁగ లేరు, 25

వర్తమానము, భూతము, భవితమందు
నున్న, యుండిన, నికముందునుండునట్టి
ప్రాణు లన్నిటి నెఱుగుదున్ పార్థ! నేను
ఎవ్వ డెవడును నా భావ మెఱుఁగలేడు. 26

సర్వ భూతజాలము తమ సర్గమందె
కామ రోషాదుల వలనఁ గలుగునట్టి
సుఖము దుఃఖాది భావముల్ చుట్టుకొనగ
మునుగుచుండును సతతంబు మోహమందు. 27

పుణ్యకర్మల చేతను పొందు నెవడు
పాపనిర్ముక్తి జగతిని; పార్థ! వాఁడు
మోహముల వీడి, ద్వంద్వవిముక్తుఁడగుచు
చిత్తనియతితో నన్ను భజించుచుండు. 28

జరయు, మరణము తొలగంగ జనుఁడెవండు
ఆత్మసాధన జేయు నన్నాశ్రయించి
వాఁడు కర్మ అధ్యాత్మమున్, బ్రహ్మమును
సర్వ మెఱిఁగిన వాఁడగు సవివరముగ 29

సాధిభూతుఁడు, నధిదైవ సహితుఁడంచు
సాధియజ్ఞుఁడం చెవడు నన్ జగతి నెఱుఁగు
వాఁడు మరణకాలమునను గూడ నిజము
నియతమనమున పార్థ! నన్నెఱుఁగ గలఁడు, 30

ఇది శ్రీరామచంద్ర కరుణా కటాక్షలబ్ధకవితాచిత్ర, భారద్వాజసగోత్ర, బృందావనాన్వయ సంజాత, నారాయణాచార్య పౌత్ర,కృష్ణమాచార్యపుత్ర, బుధజనవిధేయు, రామకృష్ణమాచార్య ప్రణీతంబైన ఉపనిషత్సారమును, బ్రహ్మవిద్యయు యోగశాస్త్రమును, కృష్ణార్జున సంవాదరూపమును నగు శ్రీభగద్గీతయందు విజ్ఞానయోగమను ఏడవ అధ్యాయమునకు ఆంధ్ర పద్యానువాదము.

# శ్రీ భగవద్గీత

## ఎనిమిదవ అధ్యాయము

## అక్షర పరబ్రహ్మ యోగము

అర్జునుఁడు పలుకుచున్నాడు:-

పరమపావన ! కేశవ ! వాసుదేవ !
ఏది బ్రహ్మము ? అధ్యాత్మ మేదియగును ?
ఏదికర్మము అధి భూత మేదియగును ?
ఏది యధిదైవ ? మఱి యజ్ఞుఁడెవఁడు కృష్ణ ! 1

దేవ ! యధియజ్ఞుఁ డెటులుండు దేహమందు
నియమ నిగ్రహములు కల్గు నియతులకును
మరణకాలము నందెట్టు లెఱుఁగబడెదు ?
వినగ వలతును వివరింతు వృష్ణితిలక ! 2

భగవానుఁడు పలుకుచున్నాడు:—

బ్రహ్మ యక్షర మదియెంతొ పరమమగును
దానిభావము తలప నధ్యాత్మ మగును
జీవజాలము నుత్పత్తి చేయునట్టి
ఈశ్వరుని చేష్టయే కర్మ మెపుడు తలప ! 3

అంతవంతము లది భూతమగును పార్థ !
ఆది పురుషుడె యధి దైవ మనగబరగు
జీవ దేహము లన్నిట చేరియున్న
అవ్యయుడనగు నేనధి యజ్ఞుడౌదు. 4

మరణ కాలమునందును మనుజుడెవడు
స్మరణజేయును విజయ నన్ మరువకుండ
నతడు నారూపు నిజముగ నరయగలడు
సంశయము లేదు దీనికి సమరవీర ! 5

మరణ కాలమునందున మనుజుడెట్టి
భావమును పొంది విడచును పార్థ ! తనువు
స్మరణచేతను కలుగు సంస్కారమునసె
మనుజుడా భావమందును మరల మరల, 6

కాన యర్జున ! నన్నెల్ల కాలమందు
స్మరణజేయుచు చేయుము సంగరంబు
బుద్ధిమనముల నాయందు బద్ధపరచి
పొందెదవు నన్ను లేదిందు సందియంబు; 7

నిరత మభ్యాసమున బుద్ధి నియుతపరచి
ఇతర మెరుగక మనమున నెల్ల వేళ
పరమ పురుషుని చింతించువాడు పార్థ !
పరమ పదమును తప్పక పడయగలడు. 8

మరణకాలాన నిశ్చల మనముకల్గి
భక్తి యెక్కుడై తాయోగ బలముచేత
బొమల నడుమన ప్రాణము పొందుపరచి
సర్వవేత్తయు నాద్యుడు శాసకుండు
నణువుకంటెను మిక్కిలి యల్పతనుడు, 9

సర్వరక్షకు డచింత్య శక్తి ధరుడు
నరుణవర్ణుడు తమమున కవలివాడు
నైన పరమాత్మ నవ్యయు నాదిదేవు
చిత్తశుద్ధితొ స్మరణము చేయువాఁడు
పరమ పురుషుని స్థానము బడయగలడు, 10

అక్షరంబని యెద్దాని నంద్రుబుధులు
యతులు జేరుదు రెద్దాని యందుగోరి
జరుపుదురు దేనికై బ్రహ్మచర్య దీక్ష
నట్టి పదమును వివరింతు ననఘచరిత ! 11

విషయ వాంఛల నన్నిటె విడచిపెట్టి
చిత్తము నెడదయందున స్థిరమొనర్చి
యోగబలమున సద్భావ యుక్తుడగుచు
ప్రాణమును మూర్ధ్నమందున వదిలపరచి. 12

బ్రహ్మ పరమును దివ్యమౌ ప్రణవ మెవడు
సతము నుడువుచు నన్నెద స్మరణచేసి
దేహమును వీడు నాతడు దివ్యుడగుచు
పరమ పదమగు మోక్షము బడయుపార్థ ! 13

ఇతర విషయము లెఱుగక నెవడు నన్ను
స్మరణజేయుచు నుండును సతతమట్టి
నిత్యయుక్తుడౌ యోగికి నేను సులభ
సాధ్యుడనగుదు లేదెట్టి సందియంబు. 14

పరమ పదమగు మోక్షము బడసినట్టి
నరులు దివ్యులు నిరతము నన్ను బొంది
శాశ్వతముగాక దుఃఖ భాజనమునైన
జనన మందరు మరల నీ జగతియందు, 15

బ్రహ్మలోకము దొట్టి యీవదియు నాల్గు
జగములన్నియు చచ్చుచు జన్మలెత్తు
నన్ను బొందిన నరులకు నరుడ! యెపుడు
జన్మలేదిక నాశమౌ జగతియందు. 16

వేయి యుగముల కాలము విధికి పగలు
వేయి యుగముల కాలమౌ విధికి నిశియు
ననుచు తెలిసెడు మానవు డమలబుద్ధి
కాలతత్త్వము తెలియంగ గలడు విజయ ! 17

వ్యక్తమగు భూతజాల మవ్యక్త శక్తి
సంభవంబగు నాది వారంభమందు
లీల నవియున్న తిరిగి విలీనమౌను
పగలు ముగియు నవ్యక్తమౌ ప్రకృతియందె. 18

భూతజాలము లీరీతి పుట్టిపుట్టి
బ్రహ్మ నిశినన వ్యక్తమౌ ప్రకృతియందు
లీనమగుచుండు నవశమై లీలనన్ని
పగలు కలుగగ పుట్టును పార్థ! మరల. 19

పరుడు గల్గు నవ్యక్తమౌ ప్రకృతికంటె
నాద్యుడగువాఁడు శాశ్వతు డక్షరుండు
జీవజాలము లన్ని నశించువేళ
లందుగూడ తానాశము పొందకుండు 20

అట్టి పదమును; యవ్యక్తు డక్షరుండు
పరమ గతియంద్రు నిరతము పార్థ! బుధులు
దేని పొందిన నరులిట తిరిగిరారొ
అట్టిపదమును; పరమాత్మ యగుదునేనె. 21

జీవజాలము లెవనిలో చేరియుండు
నిఖిల జగతియు నెవనిచే నిండియుండు
నట్టి పరమ పురుషుడు తానన్ని యెడల
సులభ సాధ్యుడు భక్తిచే శూరతిలక! 22

ధరణి యోగులే యేవేళ తనువు వీడి
మరల జన్మించు: రేవేళ మరణమంది
పుడమి మరలను జననము పొందకుందు
అట్టి కాలము వివరింతు నవధరింపు. 23

అగ్ని, తేజము, శుక్లము, నహము లందు
నమిత పావన ముత్తరాయణమునందు
మరణమందిన నర్చిర మార్గులగుచు
బ్రహ్మపదమును గాంతురు బ్రహ్మవిదులు. 24

పొగయు రాత్రియు కృష్ణము పొందియుండ
దక్షిణాయన మందున తనువు వీడి
చాలకాలము నివసించి చంద్రునందు
జన్మగాంతురు మరల నీ జగతియందు. 25

పైన తెల్పిన మార్గముల్ పార్థ ? రెండు
జగతి నెలకొని యున్నవి శాశ్వతముగ
మరల పుట్టడు తాశుక్ల మార్గగామి
పుట్టుచుండును కృష్ణము పొందువాఁడు. 26

ఇట్టి మార్గముల్ రెండిటి నెఱుఁగు యోగి
మునుగ డెప్పుడు వ్యర్థమౌ మోహమందు
కాన యర్జున ! నీ వెల్ల కాలమందు
దుఃఖమును వీడి యోగపు త్రోవనడుము. 27

వేదములచేత మఱి యజ్ఞ విధులచేత
దానములచేత ఘనమగు తపముచేత
పొందు ఫలమును మిగులుగ పొందియోగి
ఆద్యమగు మోక్ష పదము తా నధిపసించు. 28

ఇది శ్రీరామచంద్ర కరుణా కటాక్షలబ్ధకవితావిచిత్ర, భారద్వాజసగోత్ర, బృందావనా న్వయసంజాత, నారాయణాచార్య పౌత్ర, కృష్ణమాచార్యపుత్ర, బుధజనవిధేయ, రామకృష్ణమాచార్య ప్రణీతంబైన ఉపనిషత్సారమను, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును, కృష్ణార్జున సంవాదరూపమును నగు శ్రీభగవద్గీతయందు అక్షరపర బ్రహ్మయోగమను ఎనిమిదవ అధ్యాయమునకు ఆంధ్రపద్యానువాదము.



# శ్రీ భగవద్గీత

## తొమ్మిదవ అధ్యాయము

## రాజ విద్యారాజ గుహ్య యోగము

భగవానుఁడు పలుకుచున్నాడు:-

భరతవీరుడ ! నీకతి పరమైన
జ్ఞాన ముపదేశ మిచ్చెద శ్రద్ధగొనుము
దివ్యమగు దాని చక్కగ తెలియు కతన
నశుభమునుండి ముక్తుడవౌదు వీవు. 1

రాజవిద్యయు నిది దుహ్యరాజ మగును
పరమ ధర్మము శ్రేష్ఠము పావనంబు
ననుభవముచేత తెలియంగ నగునుదీని
నవ్యయంబిది సులభమౌనాచరింప. 2

ధర్మములకెల్ల పరమ మీధర్మమిందు
శ్రద్ధ విశ్వాసములు లేని జనులునన్ను
పొందనేరక తిరుగాడు చుందురెపుడు
మరణ రూపంబు సంసార మార్గమందు. 3

వ్యక్త జగతి నాదైన యవ్యక్తమూర్తి
చేత వ్యాప్తమై యుండె సుస్థిరముగాగ
జీవజాలము నాయందు చేరియుండు
నేను జీవులయందున లేను నిశ్చయముగ. 4

ఈశ్వరంబగు నాయోగ మిపుడు జూడు
భూతభర్తను కర్తను భూతతతికి
భూతజాలము నాయందు పొందిలేవు
నేను జీవులయందును లేనెలేను. 5

పార్థ! సర్వసంచారి యౌ వాయువెపుడు
నాకసమునందు నేరీతి నణగియుండు
నట్లె భూతము లన్నియు నణగియుండు
దివ్య తనుడగు నాయందు తెలియుమీవు 6

అన్ని జీవులు బ్రహ్మ కల్పాంతమందు
లీలయను నట్లు నాయందు లీనమౌను
పార్థ! మరలను బ్రహ్మ కల్పాదియందు
జీవులన్నిటి నేన సృజించు చుందు 7

ఆత్మభావమః నెల్లపు డనుసరించి
జీవులన్నిటి నేన సృజించుచుందు
ప్రకృతివశమున జీవులు పార్థ! మరలి
నస్వతంత్రత వర్తించు నంతరించు. 8

బహుళకర్మము లొనరింతు పార్థ! యిట్లు
బద్ధుడను గాక నే కర్మబంధనముల
నేలయన నేను మధ్యస్థు పోలెనుండి
సర్వ కర్మము లొనరింతు సక్తిలేక 9

సాక్షిభూతుడ నగుదు నే సర్వమునకు
సృష్టి జరుగుచు నుండె నా చేత పార్థ!
అందువలననె విజయ! యీ యఖిలజగతి
రీతులెన్నియొ పొంది వర్తించుచుండు. 10

సర్వ భూతనియంతను సాక్షినైన
నాదు మహిమము లెరుగక నరులు విజయ!
నన్ను భావించి సామాన్య నరుని పోలె
నిందజేతురు లేశము న్నిత్తిలేక. 11

వ్యర్థకాంక్షు లజ్ఞానులున్ పార్థ! జగతి
వ్యర్థకర్ములు మూఢులు వ్యర్థమైన
మోహమందున మునుగుచు ముక్తిలేక
నసుర రాక్షస భావంబు లాశ్రయింత్రు 12

అనఘ! దైవిక భావము నాశ్రయించి
పుణ్యపురుషులు నన్నాది భూతుడనుచు
నవ్యయుండంచు నెరిగి యనన్యమైన
చిత్తశుద్ధితో నన్ను భజించుచుంద్రు. 13

కొందఱిల నన్ను పొందగ గోరి పార్థ!
నన్నె కీర్తింత్రు నిరతము నన్నె కోరి
ప్రణుతులిడుచును ధీయుతుల్ పరమభక్తి
చిత్తశుద్ధితో నన్ను భజించుచుంద్రు. 14

విశ్వతోముఖుడగు నన్ను వివిధగతుల
వెయ్యురొక్కడె యగునన్న విమలబుద్ధి
జ్ఞానయజ్ఞము చేత విజ్ఞానులైన
గొందఱిల నన్ను పాసించు చుందురెపుడు 15

నేన క్రతువును యజ్ఞము నేన యౌదు
స్వధయు నేనౌదు మరియు నౌషధము నేన
నేన మంత్రము నాజ్యము నేన యౌదు
నేన యగ్నిని హుతమును నేను పార్థ! 16

తండ్రి నేనౌదు జగతికి తల్లి నేనె
తాతయును నేనె మరియును ధాత నేనె
వేద్యుడను పావనుండను విజయ! నేనె
పార్థ! ఋగ్యజుస్సామముల్ ప్రణవ మేన. 17

# యోగక్షేమం వహామ్యహమ్



భగవానువాచ:-

న్యాశ్చింతయంతో మాం
జనాః పర్యుపాసతే
గాం నిత్యాభియుక్తానాం
గ క్షేమం వహామ్యహాం. (అ. 9 - 22 శ్లో)

తపన కలిగింతు తపనుని తనువు దాల్చి
వర్ష మిచ్చెద నిలిపెద వర్షమేను
మృత్యువును నేనె మఱియు నమృతము నేనె
నేనె సదసత్తులను రెండు నిఖిలమేనె 18

జగతి గతియును భర్తయు సాక్షి హితుడు
ప్రభుడు సృష్టి స్థితి లయ కారణుడ నేన
జగతి కవ్యయ బీజము శరణ మేన
నిఖిల జగతి నిధానము నిలయ మేన. 19

వేదవిదులునై బహు యజ్ఞవిధులు జేసి
విగత కల్మషులును సోమపీథు లగుచు
నన్ను పూజించి కాంక్షింత్రు నాకసుఖము
పుణ్యఫలమున స్వర్గము పొంది యందు
తేజరిల్లెదరు కొందురు దివ్యసుఖము. 20

స్వర్గసుఖముల పొందుచు వారు చిరము
పుణ్యహీనత భూమిపై పుట్టుచుంద్రు
కామ్య కర్మల నొనరించు కాంక్షపరులు
పుట్టు చావులు నిరతము పొందుచుంద్రు. 21

ఇతర చింతలు వీడుచు నెవరు నన్ను
చిత్తమందు నిరత ముపాసించుచుంద్రు
నిత్యయుక్తులౌ వారల నేను గాతు
నిరతమును వారి క్షేమము నరయుచుందు. 22

భక్తియుక్తులు గల్గుచు పార్థ! యెవ్వ
రన్య దేవతారాధన లాచరింతు
రట్టి వారును కౌంతేయ! యవిధిచేత
నన్నుపాసించు వారౌదు రన్నియెడల. 23

యజ్ఞభోక్తను ప్రభుడ నేననుచు జనులు
వాస్తవ మెరుగజాలరు; వారు దాన
పతితు లగుచును సక్రమ పథము నుండి
అన్య దేవతారాధన లాచరింత్రు. 24

దేవతారా ధనము జేసి దేవతలను
పితరులను పూజచేసి యా పితరులందు
భూతపూజల నొనరించి భూతగణము
నన్ను కొల్చి పడయుదురు నన్నె పార్థ? 25

భక్తు డెవడైన నాయందు భక్తిచేత
పత్రమైనను పుష్పము ఫలము నైన
జలము నైనను భక్తినిశ్చలత నిచ్చు
నేది యైనను గ్రహియింతు నేను పార్థ! 26

ఏది చేసిన తినున దదేది యైన
నమలబుద్ధితో చేసెడు యజ్ఞమైన
దానమేదైన ఘనమైన తపమునైన
వాని నన్నిటి నర్పింపు పార్థ! నాకు. 27

కర్మసన్న్యాస యోగము కలుగుకతన
పుణ్యపాపపు ఫలములు పొందకుండ
కర్మబంధంబు లందుండి కలుగుముక్తి
బంధముక్తుడ వగుచునన్ బడయుగలవు. 28

సర్వభూతము లందును సముడ నేను
ప్రియులు ద్వేష్యులు ననియెడు భేదమెఱుగ
భక్తి నెవరునన్ భజియింత్రు పార్థ ! వారి
యందు నేనుందు వారు నాయందు నుంద్రు. 29

దురిత కర్మము లొనరించు దుష్టుడైన
చిత్తశుద్ధితో నన్ను భజించెనేని
మంచి నిశ్చయ మొందుట మనము నందు
చెప్ప వలయును వానిని శ్రేష్ఠుడనుచు. 30

అట్టి జనుడు తా వేగ ధర్మాత్ము డగుచు
బరమ శాంతిని పొందును పార్థ ! నిజము
నాయెడల భక్తి గలవాడు నాశమెఱుగ
డంచు చాటుము భేరి వాయించి నీవు. 31

పార్థ ! నన్నాశ్రయించిన వార లెట్టి
పాపయోనుల పుట్టిన వారలైన
స్త్రీలు శూద్రులు వైశ్యులున్ చేరగలరు
పరమపదమగు మోక్షము పరము నందు. 32

పరమపుణ్యులు బ్రాహ్మణుల్; భక్తులైన
రాజఋషులును ననుచేర రాకయుంద్రె ?
శాశ్వతముగాక సుఖహీన జగతినీవు
చిత్తశుద్ధితో నన్ను భజించు విజయ ! 33

మనము నాయందె నిలుపుము మరలకుండ
నన్ను పూజించు భక్తితో నతుడ వగుము
ఆత్మశుద్ధితో మత్పరాయణుడ వైన
పడయ గలవింక నన్నీవు పార్థ ! నిజము. 34

ఇది శ్రీరామచంద్ర కరుణా కటాక్షలబ్ధకవితాచిత్ర, భారద్వాజసగోత్ర, బృందావనాన్వయసంజాత, నారాయణాచార్య పౌత్ర, కృష్ణమాచార్యపుత్ర, బుధజనవిధేయ, రామకృష్ణమాచార్య ప్రణీతంబైన ఉపనిషత్సారమును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును, కృష్ణార్జున సంవాదరూపమునునగు శ్రీభగవద్గీతయందు రాజవిద్యారాజగుహ్యయోగమను తొమ్మిదవ అధ్యాయమునకు ఆంధ్రపద్యానువాదము.



# శ్రీ భగవద్గీత

## పదియవ అధ్యాయము

## విభూతి యోగము

భగవానుఁడు పల్కుచున్నాడు:-

ప్రీతి వినుచున్న నీకునే ప్రేమతోడఁ
మంచి పలుకుల వినిచెద మరల వినుము
సురగణంబును మఱి మహర్షులును గూడ
ఆద్యుఁడగు నాదు జననము నరయులేరు. 1

సర్వ లోకేశురుఁడగు నన్ను జనుడెవండు
అజుడ నాద్యుఁడ నగుదు నేనంచు తెలియు;
బుద్ధిమంతుఁడు వాడగు పుడమిజనుల
దురితముల నుండి పూర్తిగ తొలఁగ గలఁడు. 2

బుద్ధి జ్ఞానము మఱియు సమ్మోహగుణము
శమము దమమును సత్యము క్షమయు మఱియు
భవము మరణము భయము నిర్భయత్వములును
సమత సుఖదుఃఖములు సహింపయును తుష్టి
తపము కీర్తియు నపకీర్తి దానములను
పొందుచుండును నావల్ల భూతగణము. 3

సప్త ఋషులును, దేవర్షి సత్తములును
మనువులు పదియు నాలుగు మందిగూడ
సంభవించిరి నా మనోజాతు లగుచు
వారి నుండియె కలిగెను పార్థ ! జగతి. 4

నాదు యోగ విభూతులనన్ని యెవఁడు
తెలియ గలుగును చక్కగ దివ్యబుద్ధి
యుక్తుఁడగు వాఁడు నిశ్చల యోగమునకు
సందియము లేదు వీరుఁడ ! సవ్యసాచి ! 5
జగతి యంతయు నావల్ల జరిగెసృష్టి
జగతి నావల్ల వర్తించు సర్వవేళ
ననుచు నెఱిఁగిన విజ్ఞు లధికభక్తి
భజన సేతురు నిరతము పార్థ ! నన్ను. 6

మనము నాయందె నిలుపుచు మరలకుండ
పార్థ ! నిరతము మద్గత ప్రాణులగుచు
నుడువు కొనుచును నాభావ మొకరికొకరు
సంతసింతురు పండితుల్ జగతియందు. 7

చిత్తశుద్ధితో నేకాగ్ర చిత్తు లగుచు
పార్థ ! నన్ ప్రీతితోడుత భజనసేయు
ధ్యాన యోగులందరకు నే జ్ఞానమిత్తు
సులభ మార్గాన ననుజేర గలుగు కొఱకు. 8

నరుడ ! వారల గృపతోఁడ నరయు కొఱకు.
నిరతమును వారి యాత్మల నిలచి నేను
జ్ఞానదీపము చేత నజ్ఞాన తమము
నాశ మొనరించి మోక్షము నందజేతు. 9

అర్జునుఁ డనుచున్నాడు:-
పరమ పదమీవె నీవయె పావనుఁడవు
ఆదిదేవుడ వంతట నాద్యమీవె
పరమపురుషుఁడు విభుఁడును బ్రహ్మమీవె
నీవ దివ్యుఁడ వజుఁడవు నీవ యంచు 10

దేవఋషి నారదు డసిత దేవలులును
వ్యాస ఋషియును సర్వ మహర్షులున్ను
తెల్పియుండిరి నీవును తెలిపితిపుడు
స్వయముగను నాకు పావన ! శౌరి ! కృష్ణ ! 11

నీవు నుడివిన దంతయు నిక్కమనుచు
నమ్మకము గల్గె నాకు నో నలిననేత్ర !
అమర వరులైన మఱియు నా యసురులైన
నెరుగ జాలరు నీరూప మెపుడు కృష్ణ ! 12

భూతభావన ! భూతేశ ! పురుషతిలక !
దేవదేవ ! జగత్పతీ! దీనబంధు !
ఆత్మభావము స్వయముగ నరయగలవు
నీవె; తెలియజాల రొరులు నిన్ను కృష్ణ ! 13

ఏ విభూతుల చేత నీవెల్ల జగతి
వ్యాప్తమై యుంటి వట్టి నీ యఖిలమైన
దివ్యమహిమలు నాకింక తెలుపు కృష్ణ !
అర్హుఁడవు నీవె వినిపింప నమరవంద్య ! 14

మారజనకుఁడ ! నిరతము స్మరణ జేసి
నిన్ను నేరీతి నెరుగగంగ నేర్తు నేను ?
ఏ విభూతుల నిన్ను నే నెరుఁగగలను ?
నిన్ను ధ్యానింప లక్ష్యము లెన్ని గలవు ? 15

నీ విభూతుల యోగము నెరుఁగఁబరచు
మరల నింకొక సారి యో మాననీయ
అమరపూజిత ! నీదు బోధామృతంబు
నెంత విన్నను తృప్తి నా కింతలేదు. 17

భగవానుఁడు పల్కుచున్నాడు:-

దివ్యమగు నా విభూతులన్ తెలియఁ బరచ
విస్తరంబుగ వినిపింప వీలుగాదు
నా విభూతు లనంతముల్ నరుడ ! కాన
ముఖ్యమగు వాని గొన్నిటి ముచ్చటింతు. 17

అమరసన్నిభ ! సర్వ బూతముల యొక్క
అంతరము అందు నెలకొన్న యాత్మనేన
శాంతనవుపౌత్ర ! యీ బూత జాలములకు
నాదిమధ్యాంతములు నేన యఖిల మేవ. 18

ధీర ! విష్ణుడ ద్వాదశా దిత్యులందు
నంశుమంతుల లోన నే నర్కుడౌదు
సఖుఁడ ! నే మరీచిని మరుత్సప్తకమున
తారలందున చంద్రుఁడన్ పార్థ ! నేనె. 19

వేదముల యందు నే సామవేదమగుదు
వాసవుఁడ నేనె యీ నాకవాసులందు
నింద్రియంబుల నేన చిత్తేంద్రియమును
జీవజాలము అందు నే చేతనమును. 20

శంకరుండును రుద్రులన్ సవ్యసాచి
యక్షరాక్షసు అందు నే యక్షపతిని
నగము లన్నిట నే మేరునగము నగుదు
పావకుండను నే నష్ట వసువులందు. 21

హితము భోధించు శుభ పురోహితులయందు
దేవగురుఁడను కురువంశ తిలక పార్థ!
స్కందుఁడను నేన వీరులౌ స్కంధపతుల
సాగరము నేన నిఖిల మౌ సరసులందు 22

ఋషిగణంబున భృగుండను ఋషిని నేనె
యజ్ఞములయందు నే జపయజ్ఞమగుదు
స్థావరములందు నే హిమశైలమగుదు 23

వృక్షజాతుల నశ్వత్థ వృక్షమేన
నరుఁడ! దేవర్షులందు నే నారదుండ
తలపఁ జిత్రరథుండ గంధర్వులందు
సిద్ధ గణమున కపిలుడన్ సిద్ధుడేన 24

అశ్వముల యందు నుచ్చైశ్శ్రవాశ్వమేన
గజములందు నైరావతగజము నేనె
పార్థ! నరజాతి నే నరపాలకుండ
దివ్యమౌ నా విభూతులు తెలియు పార్థ! 25
ఆయుధము లందు నేను వజ్రాయుధమును

ధేనుగణమున నే కామధేను వగుదు
చూలు కలిగించు వారలన్ సూనశరుఁడ
సర్పరాజగు వాసుకి సర్పమేన. 26

నాగముల యందు పార్థ! యనంతు డగుదు
వరుణుఁడగుదు నేన జలదేవతలయందు
నర్యముండను పితరుల నార్యచరిత
శాసకుల యందు విజయ! నే శమనుడగుదు. 27

అసురగణమున ప్రహ్లాదు డగుదు నేన
గణన చేసెడు వారలన్ కాలమగుదు
మృగములకు నెల్ల రాజును మృగములందు
పై నతేయుండ పక్షులన్ వాసవసుత ! 28

వేగవంతులన్ పవనుడ విజయ! నేనె
అస్త్రవిదులందు రాముండ నరయ నేనె
జలచరములందు మకరమున్ సవ్యసాచి
జాహ్నవిని నేనె నదులందు సమరవీర ! 29

భూతసృష్టికి కౌంతేయ పొల్పుమీర
ఆది యంతము మధ్యయు నగుదునేనె
విద్యలన్నిట నధ్యాత్మ విద్యనేనె
వాదముల మూటం ప్రకమ వాదమేనె 30

అక్షరములం దకారము నగుదునేనె
ద్వంద్వమగుదు సమాసము లందు నేనె
అక్షయంబగు కాలము నగుదు నేనె
విశ్వతోముఖుండగు నట్టి విధిని నేనె. 31

సర్వసంహర్త మృత్యువున్ సఖుండ నేనె
పుట్టబోయెడు వానికి పుట్టువేనె
మృదుల వాక్కును కీర్తియు స్మృతియు నోర్పు
శ్రీయు ధృతియును నేనయే స్త్రీలయందు. 32

సామములయందు నే బృహత్సామమగుదు
ఛందములయందు గాయత్రి ఛందమైన
మార్గశీర్షము నౌదు నే మాసములలో
ఋతువు లారిట నే వసంతర్తువగుదు. 33

వంచకములందు జూదమౌన్ పార్థ ! నేనె
దీప్తి గలవార లందున దీప్తినేనె
విజయశీలుర యందలి విజయ మేనె
యత్నపరులందు నేనె ప్రయత్నమగుదు
బలము నేనౌదు భువి బలవంతులందు. 34

వాసుదేవుడ నే వృష్ణివంశమందు
పాండుపుత్రుల నేనౌదు పార్థుడనగ
శుక్రుడగుదును కవులందు శోభమిగుల
మునిగణంబున నే వ్యాస మునిని విజయ! 35

దండనముఁ జేయువారల దండనీతి
విజయకాంక్షుల యందలి విజయనీతి
గుహ్యముల యందు మౌనము గూడనేనె
జ్ఞానవంతుల వెలుగొందు జ్ఞానమేనె. 36

భూతజాలపు నుత్పత్తి హేతువైన
బీజమును నేనె యౌదును విజయ ! వినుము
జగతి నీ చరాచర భూతజాలమందు
నేను లేనట్టి దేదియు లేనెలేదు. 37

తెలుప శక్యముగానివి దివ్యమైన
నావిభూతు లనంతముల్ నరుఁడ! వినుము
విస్తరంబగు మహిమలన్ విజయ ; నీకు
సంగ్రహంబుగఁ దెల్పితి చాలవరకు 38

సంపదను గల్గి తేజము శక్తియుతము
సత్త్వ మేయది గలదిల సవ్యసాచి !
అట్టి యఖిల వస్తుచయము నరయ నాదు
దివ్య తేజోంశ భవములు తెలియు పార్థ ! 39

విజయ ! నా విభూతులను సవిస్తరముగ
నెరుఁగ కలిగెడు లాభ మదేమి గలదు ?
విశ్వమంతయు నేన వ్యాపించి, దాల్తు
నఖిల జగతియు నాయొక యంశచేత. 40

ఇది శ్రీరామచంద్ర కరుణా కటాక్షలబ్ధకవితావిచిత్ర, భారద్వాజసగోత్ర, బృందావనా న్వయసంజాత, నారాయణాచార్య పౌత్ర, కృష్ణమాచార్యపుత్ర, బుధజనవిధేయ, రామకృష్ణమాచార్య ప్రణీతంబైన ఉపనిషత్సారమును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును, కృష్ణార్జున సంవాదరూపమునునగు శ్రీభగవద్గీతయందు విభూతి యోగమను పదియవ అధ్యాయమునకు ఆంధ్రపద్యానువాదము.



# శ్రీ భగవద్గీత

## పదకొండవవ అధ్యాయము

## విశ్వరూప సందర్శనయోగము

అర్జునుఁడనుచున్నాడు:-
కేశిమర్ధన ! నను కటాక్షించు కొఱకు
వినిచితివి గుహ్య మధ్యాత్మ విద్యనాకు
నీవు నుడివిన వాక్కులన్ నీలవర్ణ !
మోహభావము నుండి నే ముక్తుఁడయితి. 1

భూత భవములు లయమును పురుష తిలక!
విస్తరంబుగ వింటిని వీనులలర
నవ్యయంబగు నీదు మాహాత్మ్యమేను
తెలిసికొంటిని పద్మాక్ష ! దేవదేవ ! 2

పరమ పావన ! నినుగూర్చి పలికినట్టి
నీదు పలుకులు కమలాక్ష ! నిక్కమయ్యె
దేవ ! ఐశ్వరంబైన నీదివ్యరూపు
చూడవేడెద దయతోడ చూపునాకు. 3

చోద్యమగు విశ్వరూపము చూడనాకు
శక్యమగునని తలచిన సారసాక్ష !
నన్ను మన్నించి కృపతోడ నలిననాభ !
అవ్యయంబగు నీరూప మమరజూపు 4

భగవానుఁడు పలుకుచున్నాడు:

సంఖ్య తెలియక లెక్కింప సాధ్యపడక
వర్ణబహుళమై వర్ణింప వలనుఁబడక
వివిధ రూపము లొందిన విజయనాదు
దివ్యరూపముల్ చక్కగ తేరిజూడు. 5

అష్టవసువుల రుద్రుల నాశ్వినులను
ద్వాదశా దిత్యులను మరుత్సప్తకమును
పుడమి జనులకు నదృష్ట పూర్వమైన
బహువిధాశ్చర్య దృశ్యముల్ పార్థ ! చూడు. 6

చరము సచరమునైన యీ సర్వజగతి
విశ్వరూపము నందున్న విధముజూడు
మింక నేమేమి దర్శింప నిచ్ఛగింతు
వట్టివన్నియు చూడు నాయందు పార్థ ! 7

విజయ ! యతి దివ్యమైన నావిశ్వరూపు
చర్మచక్షుల దర్శింప సాధ్యపడదు
దివ్య చక్షుల నిచ్చితి తెరిచూడు
మైశ్వరంబగు నారూప మచలదృష్టి 8

సంజయుఁ డనుచున్నాఁడు:—

అనుచు పలుకుచు ధృతరాష్ట్ర! యచ్యుతుండు
పరమ యోగేశు డత్యంత పావనుండు
అద్భుతంబుగ జూపె నత్యంత పరమ
మైశ్వరంబగు తనరూపమర్జునునకు. 9

వక్త్రసంఖ్యల లెక్కింప వలముగాక
దివ్య భూషణములు దాల్చి తేజరిలుచు
నాయుధానేకములు దాల్చి హస్తి విభుఁడ !
వివిధ భంగుల నొప్పె నావిశ్వరూపు. 10

దివ్య వస్త్రంబులను దాల్చి దీప్తమగుచు
దివ్య మాలిక లురమున తేజరిలగ
విశ్వతో ముఖములుగల్గి విశ్వరూప
మంతమేలేక నుండె నత్యద్భుతముగ 11

వేయి సూర్యులు నభమున వెలిఁగినపుఁడు
కలుగ తెజము సరితూగ గలుగుకొంత
కాంతివంతమౌ నాదివ్య కాంతితోడ
నన్యకాంతులు సరితూగ వతనికెందు. 12

బహువిధంబుల విభజింప బడినయట్టి
విశ్వమంతయు నొకచోట విడిసినట్లు
కమలనాభుని దేహ భాగంబులగుచు
నమరియుండుటఁ జూచె నా నర్జునుండు. 13

విశ్వమంతయు తనయందు వెలుగుచున్న
మాధవునిజూచి యాశ్చర్య మగ్నుఁడగుచు
హర్షపులకిత గాత్రుఁడై యంజలించి
అర్జునుండిట్లు పల్కెనా యచ్యుతునకు. 14

అర్జునుఁడు చెప్పుచున్నాడు:-

దేవ ! పరమేశ ! నీదివ్య దేహమందు
దేవ సంఘమున్ దివ్యులౌ దేవఋషుల
ధాత, సురగుల బహువిధ భూతకోట్ల
చూచుచుంటిని శ్రీకృష్ణ చోద్యమంది. 15

బాహువు లనేకములు కల్గి బహుళసంఖ్య
నొప్పు నుదరముల్ నేత్రములున్న నిన్ను
చూచుచుంటిని శ్రీకృష్ణ చోద్యమంది
ఆది మధ్యాంతములు లే వనంతనీకు. 16

గదయు చక్రకిరీటముల్ గల్గి యమిత
తేజమున జేసి దిక్కుల దీప్త పరచు
దీప్త సూర్యాగ్నులను బోలి తేజరిలెడు
చూడజాలని నీరూపు చూచుచుంటి. 17

అరయ దగుదువు పరముడ వక్షరుఁడవు
సర్వ జగతికిని పరమాశ్రయుఁడ వీవు
శాశ్వతంబగు ధర్మ రక్షకుడవీవు
పుండరీకాక్ష : నీవాది పూరుషుఁడవు! 18

ఆది మధ్యాంత రహిత మనంత వీర్య
మగుచు శశి సూర్య నేత్రుడవైన నిన్ను
జగతి యంతయు తపియింప జాలియున్న
దీప్త రూపుగ కనుగొంటి దేవదేవ! 19

అవని ఆకాశముల మధ్య యంతరమును
దిశలు నీచేత నిండెను దివ్యతేజ!
అద్భుతంబగు నీరూప మమరగాంచి
లోకములు మూడు భీతిల్లె లోకపాల ! 20

సురగణంబులు నీయందు జొచ్చుచుండె
నంజలించిరి మతికొంద రమితభీతి
స్వస్తి వచనమ్ముల్ వల్కుచు సర్వఋషులు
స్తోత్రములు చేయుచుండిరి చోద్యమవగ. 21

అష్టవసువులు రుద్రులు నాశ్వినులును
దివిజు లాదిత్యులును విశ్వదేవతలును
యక్ష గంధర్వ మరుతులు రాక్షసులును
సిద్ధసాధ్యులు పితరులు చేరియొకట
నద్భుతంబుగ నినుజూతు రమరవంద్య. 22

వక్త్రనేత్రము లుదరముల్ పాదములును
బాహులూరులు దంష్ట్రలు బహుళమగుచు
భీకరంబగు నినుజూచి లోకములును
బెగ్గడిల్లెను; నేనును భీతిగొంటి. 23

దివికి తాకుచు బహువర్ణ దీప్తమగుచు
జ్వలిత నేత్రములును వ్యాత్త వక్త్రములతొ
నొప్పుచుండిన నీరూపు చొప్పుగాంచి
ధైర్యమెడలెను నా యందు దానవారి ! 24

దానవాంతక!యతితీక్ష్ణ దంష్ట్రములతొ
దీప్త కాలాగ్ని బోలుచు తేజరిలెడు
నీదు ముఖముల జూడగ నేరకుంటి
దిక్కు తోచదు దయచూడు దేవదేవ ! 25

నలిననేత్ర ! యీ ధృతరాష్ట్ర నందనులును
సారసాక్షుఁడ! భూపాల సంఘములును
ద్రోణ భీష్ములు కర్ణుడున్ ద్రుపదుఁడాది
యుధికి వచ్చిన నాపైపు యోధవరులు. 26

త్వరిత గతితోడ నీదు వక్త్రములయందుఁ
జొచ్చుచుండిరి శ్రీకృష్ణ చోద్యమవగ
కొందరట నీదు దంష్ట్రలయందు జిక్కి
చూర్ణ శిరములతో నుండఁ జూచుచుంటి. 27

నదులు పుట్టిన దేచోట నై సగాని
చివరకన్నియు సంద్రము జేరురీతి
జేరుచుండిరి నరలోక వీరులంత
జ్వలిత మగు చున్న నీనోట వాసుదేవ! 28

ఆత్మ నాశము నొందగ నమితవేగ
జ్వలన పావకు జొచ్చెడు శలభులట్లు
నాశమొందగ నతివేగ నరులునీదు
వక్త్రములజొచ్చుచుండిరి వాసుదేవ! 29

జ్వలిత ముఖములన్ మ్రింగుచు జగములన్ని
చప్పరించుచు నుంటివి జలజనేత్ర!
అమిత తేజము నింపి యీ యఖిలజగతి
తప్త మొనరించు చుంటివి దానవారి! 30

వందనము నీకు జేసెద వాసుదేవ!
సన్నుతించెద నాకు ప్రసన్నుడగుము
అవగతము గాదు నీరూప మాదిదేవ!
దేవ! నీరూప మేర్పడ తెలియజెప్పు; 31

భగవానుడు చెప్పుచున్నాడు:—

కాలరూపుడ నేను లోకాల గాతు
నాశ మొనరింతు లోకాల నరుడ నేనె
అవతరించితి లోక సంహారమునకై
నీవు లేకున్న నిలనుండ నేరరరులు 32

అనికి లెమ్మిక గొనుమిక యశమునీవు
అరుల మర్దించి రాజ్యంబు ననుభవింపు
శత్రులెప్పుడొ నా చేత చంపబడిరి
కారణము నీవుగమ్మిక కలత గొనకు. 33

ద్రోణుడు భీష్ముడు జయద్రథుడును కర్ణు
డన్య వీరులు నాచేత నంతమైరి
వెతను జెందక పరిమార్చు విజయ నీవు
యుద్ధమొనరించు గెలుచుట సిద్ధమింక. 34

సంజయుడు చెప్పుచున్నాడు:-

ఆదిదేవుని వచనము లాలకించి
హస్తములు మోడ్చి వినతుల నాచరించి
కంపమందుచు గద్గద కంఠుడగుచు
నచ్యుతనకిట్లు పల్కె నాయర్జునుండు. 35

అర్జునుఁడు పల్కుచున్నాడు:-

కేశిమర్దన! నీనామ కీర్తనమున
సంతసించుచు నున్నవి జగములన్ని
అసురు లతి భీతి పరుగిడి రన్నిదిశల
సిద్ధ వరులు నీకంజలి బద్ధులైరి. 36

నీవ సదసత్తులు వరుడ వీవయగుదు
బ్రహ్మకాదియౌ యక్షర బ్రహ్మమీవ
ఆదిపురుష' యనంతుడ వై ననీకు
సిద్ధవరులేల యంజలి బద్ధులవరు? 37

ఆదిపురుషుడ వీవాదు వాదిదేవ
జగతి యంతయు నీయందె శరణమగును
వేద్యమగుదువు నీవయె వేత్త వగుదు
విశ్వమంతయు నీరూపె విశ్వరూప! 38

వరుణు డగ్ని యు యముడును వాయువులను
చంద్రుడును నీవ బ్రహ్మ ప్రజాపతులును
నీకు వినతులు నావివె నీలవర్ణ!
మరల మరలను ప్రణతులు మరలనిడెద. 39

వీర్య విక్రమయుతుడవు విశ్వరూప!
నిండియుండితి వంతట నీవెదేవ!
సర్వజగతియు, ప్రకృతియు సర్వమీవె
అన్ని యెడలను నీకిదె యంజలింతు. 40

సఖుడవని యెంచి పిలిచితి సఖుడయనుచు
యాదవుడ యంచు పిలిచితి నాదమరచి
ప్రియుడ! పలికితి నీయెడ ప్రేమవలన
దివ్య మహిమను లెరుగక దేవదేవ! 41

హాసక[illegible]నకు నాహార విహారములను
ఆసన శయనాదుల పరిహాసములను
పలికియుండగ వచ్చునే బరమ పురుష
వాని మన్నించి దయసేయ వలయునాకు. 42

జగతినంతయు బ్రోచెడు జనకుడీవ
గౌరవంబున పూజించు ఘనుడవీవ
నీవయధికుడ వారాధ్యు డీవయౌదు
లేరుసమ ములిక నధికులు లేనెలేరు. 43

తండ్రి కొమరుడు చేసిన తప్పుసైచు
మిత్రు పొరపాటు మన్నించు మిత్రువరుడు
ప్రియుడు ప్రియురాలి మన్నించు ప్రేమతోడ
వినయ వినమిత దేహినై వినతిసేతు
నట్లె మన్నించు మనమున నాదిదేవ! 44

పూర్వ మెరుగక నెంతొయ పూర్వమైన
విశ్వరూపము గాంచినే వివశుడైతి
చేతమందున నమితమౌ భీతిగల్గె
పూర్వరూపము జూపుము పురుషసింహ! 45

సర్వమును నిండు దేహంబు సంకుచించి
మకుట భూషితమౌ నేక మస్తకముతొ
హస్తములయందు దాల్చుచు నాయుధములు
మానుషంబగు నీరూపు మరల జూపు. 46

భగవానుడు పలుకుచున్నాడు:-

ప్రియుడ యిపుడిట నీయెడ ప్రీతిచేత
దివ్యమైనది, పరుల కదృష్టపూర్వ
మంతరహితము, పరమము నాద్యమైన
విశ్వరూపము జూపితి విజయ! నీకు. 47

వేదముల నభ్యసించియు వేలకొలది
దానములుజేసి భీకర తపముజేసి
యజ్ఞయాగాది క్రతువుల నాచరించి
చూడజాలని నారూపు చూచితీవు. 48

రూక్షణంబగు నా దివ్యరూపు గాంచి
భయము నొందకు చిత్త విభ్రాంతి గొనకు
సూక్ష్మరూపము దాల్చెద చూడుపార్థ!
భీతి పోద్రోలి మనమున ప్రీతికలుగ. 49

సంజయుండనుచున్నాడు:-

అనుచు పలుకుచు తన దైన యసలురూపు
వాసుదేవుడు చూపెను పార్థునకును
భీతిచేతను మనమున రీతిదప్పి
యున్నయర్జును నోదార్చె వెన్నుదట్టి. 50

అర్జునుఁడు పలుకుచున్నాఁడు:-

మానుషంబగు నీరూపు మరలగాంచి
భీతి దొలగెను మనమును ప్రీతిపొందె

భగవానుఁడు పలుకుచున్నాఁడు;-

దేవతలు జూడగోరెడు దివ్యరూపు
కాంచ గల్గితి వీవిట కన్నులార. 51

వేదములునేర్చి మరియును వేలకొలది
దానములుజేసి ఘనమగు తపముజేసి
యజ్ఞ యాగాదులెన్నియొ నాచరించి
చూడజాలని నారూపు జూచితీవు! 52

నన్ను తెలియగ జూడంగ నన్ను జేర
పరమభక్తిచే సాధ్యమౌ పాండుతనయ !
విషయములయందు నాసక్తి వీడియెవడు.
బుద్ధినిలుపును వాడెనన్ బొందగలడు. 53

ఇది శ్రీరామచంద్ర కరుణా కటాక్షలబ్ధ కవితాచిత్ర, భారద్వాజసగోత్ర, బృందావనా న్వయసంజాత, నారాయణాచార్య పౌత్ర, కృష్ణమాచార్యపుత్ర, బుధజనవిధేయ, రామకృష్ణమాచార్య ప్రణీతంబైన ఉపనిషత్సారమును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును, కృష్ణార్జున సంవాదరూపమునునగు శ్రీభగద్గీతయందు విశ్వరూప సందర్శనయోగమను పదునొకండవ అధ్యాయమునకు ఆంధ్ర పద్యానువాదము.

# శ్రీ భగవద్గీత

## పండ్రెండవ అధ్యాయము

## భక్తి యోగము

అర్జునుఁ డనుచున్నాడు:-

నిత్యము నిన్ను పాసించెడు నియతులందు
నక్షరుండగు పరమాత్ము నన్నియెడల
ధ్యాన మొనరించు వారిలో జ్ఞాననిష్ఠ
నధికులెవ్వరొ ! తెలుపుమో యమరవంద్య ! 1

భగవానుఁడు పలుకుచున్నాడు:-

మనము నాయందె నిల్పుచు మరలకుండ
శ్రద్ధగల్గుచు భక్తితో సంతతంబు
చిత్తశుద్ధితో నన్ను పాసించువాఁడు
పరమ భక్తుఁడు నాకువి బరగువాడు.

నియతి సర్వేంద్రియముల నిగ్రహించి
సర్వ విషయములందును సమతగల్గి
భూత హితమును గోరెడు బుద్ధిగల్గి
అక్షరుండ నిర్దేశ్యుడ వవ్యయుడయి. 3

చింత్యుడునుగాక మిక్కిలి స్థిరతగల్గి
నిర్వికారుడు వ్యక్తుడు నిత్యుడగుచు
విశ్వమంతయు నిండిన విభుని; భక్తిc
పూజజేసిన మనుజుడు పొందునన్ను. 4

నిర్గుణుండగు బ్రహ్మమున్ నిత్యమందు
నిష్ఠc బూజింప మిక్కిలి కష్టమగును
దేహధారుల కెప్పుడు దివ్యమైన
నిర్గుణోపాసనము జేయు నీతిగాదు. 5

సర్వకర్మలు నాయందు సన్న్యసించి
నిశ్చలుండయి ధ్యానించు నిరతమెవcడు
వాని సంసార జలధిలో బడగనీక
నుద్ధరించెద సత్యమీ యుర్వియందు. 6

చిత్తమెప్పుడు నాయెడ స్థిరతనిల్పి
బద్ధ మొనరింపు నాయందె బుద్ధినెపుడు
చిత్తశుద్ధితొ నర్చలు చేసితేని
నీవు నాయందె నుందువు నిశ్చయముగ. 7

చిత్త మెప్పుడు నాయెడ స్థిరత నిలుప
శక్తి లేదేని నభ్యాసశక్తి చేత
చంచలంబగు మనమును చక్కబఱచి
పొంద యత్నింపు విశ్వాసమంది నన్ను. 8

శక్తి లేకున్న నభ్యాస శక్తి నుండ
భగవదర్థము కర్మలన్ బద్ధుఁడగుము
భగవదర్థము కర్మల బరగచేసి
ముక్తుడగుదువు నీకగు మోక్షసిద్ధి. 9

నన్ను బొందగ యోగంబు నాశ్రయించి
కర్మ లొనరింప శక్తియు కలుగదేని
నియత మొనరించి మనమును నిశ్చలముగ
అహరహంబును తా నియతాత్ము డగుచు
సర్వకర్మల నాయందు సన్న్యసించు. 10

సాధనలకంటె కడుమిన్న జ్ఞానమౌను
జ్ఞానమునకంటె కడుమిన్న ధ్యానమగును.
ధ్యానమునకంటె మించును త్యాగమనగ
కర్మఫలముల త్యజియింపఁ గలుగు శాంతి. 11

సర్వ భూతంబులందును సమత గలిగి
దయయు స్నేహంబు బాటించు ధ్యానయోగి
మమత నహముల వర్జించి మసలుచుండు
సుఖము దుఃఖము నొకటిగ చూచుచుండు. 12

అహరహంబును తా నియతాత్ము డగుచు
దృఢమనంబును నిరతము తృప్తిగల్గి
బుద్ధి మనముల నాయందె బద్ధపరిచి
యెవడు మసలును వాడు నాకిష్టుడగును, 13

భీతి గొనకుండు నెవనిచే భూతగుణము
భూతములగాంచి యెవడిల భీతిగొనడు
సుఖము నుద్వేగమును భయశోకములను
వీడునెవ్వడు ప్రియుడగు వాఁడునాకు. 14

కార్యదక్షత శుచియును గల్గియుండి
ఫలమునం దపేక్షయులేక బాధగొనగ
సర్వ కార్యము లారంభ కర్మగొనక
భక్తి గల్గువాడిష్టుడు పార్థ ! నాకు. 15

ద్వేషభావము గొనక సంతోషి గాక
రిత్త శోచన లేక కోరికలు లేక
అశుభ శుభములౌ కర్మల నన్ని వదలి
భక్తి గల్గు వాడిష్టుడు పార్థ ! నాకు 16

శత్రులందును మిత్రులన్ సమతగల్గి
మానమవమానముల యందు మమత వీడి
సుఖము దుఃఖము నిందల స్తుతుల యందు
శీతముష్ణము లందును జేసి సమత. 17

మౌనభావంబు సంతుష్ట మనముగల్గి
స్థిరనివాసము లేక సుస్థిర మనంబు
భక్తియును గల్గి వర్తించు భక్తుడెవడు
వాఁడు కడునిష్ట డగుచుండు పార్థ ! నాకు. 18

శ్రద్ధ గల్గుచు భక్తితో సంతతంబు
నమృతమయమగు నీ ధర్మ మనుసరించి,
ఉక్త రీతి నుపాసన మొనర జేయు
వారు నాకెంతొ ప్రియులగు వారు పార్థ ! 19

ఇది శ్రీరామచంద్ర కరుణా కటాక్షలబ్ధకవితావిచిత్ర, భారద్వాజసగోత్ర, బృందావనా న్వయసంజాత, నారాయణాచార్య పౌత్ర,కృష్ణమాచార్యపుత్ర, బుధజనవిధేయ,రామకృష్ణమాచార్య ప్రణీతంబైన ఉపనిషత్సారమును, బ్రహ్మవిద్యయు యోగశాస్త్రమును, కృష్ణార్జున సంవాదరూపమునునగు శ్రీభగద్గీతయందు భక్తియోగమను పండ్రెండవ అధ్యాయమునకు ఆంధ్ర పద్యానువాదము.

# శ్రీ భగవద్గీత

## పదమూడవ అధ్యాయము

## క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగము

అర్జునుఁడు పలుకుచున్నాడు:-

ప్రకృతి యననేది ? పురుషుడు పరుడెవండు ?
ఏది క్షేత్రము ? క్షేత్రజ్ఞు డెవడు కృష్ణ ?
ఏది జ్ఞేయము ? సుజ్ఞాన మేది యగును ?
తెలియ గోరెద సర్వము తెలుపుదేవ ! 1

భగవానుఁడు పలుకుచున్నాడు;-

క్షేత్రమగు నీ శరీరము క్షేత్రమెఱుగు
వాని క్షేత్రజ్ఞు డందురు పార్థ ! బుధులు
క్షేత్రవిదుడను నే నన్ని క్షేత్రములను
క్షేత్ర విషయక జ్ఞానమె శ్రేయమగును. 2

క్షేత్ర మేదియో యెట్టిదో క్షేత్రమనగ
క్షేత్ర మెందుండి వచ్చెనో చేష్ట లెవియో
క్షేత విదుడగు నెవడిల: చెప్పుచుంటి
సంగ్రహంబుగ వినుమీవు సవ్యసాచి ! 3

బహువిధంబుల నుడివిరి పరమ మునులు
వేదములు దీని నుడివెను వివిధగతుల
బ్రహ్మసూత్రము లందును బహువిధముల
యుక్తియుక్తముగ నిదియె ప్రోక్తమయ్యె. 4

పరమ మవ్యక్తమైన యా ప్రకృతియంత
భూతగణమును గుణములు బుద్ధ్యహములు
వాసనాది జ్ఞానేంద్రియ వాసనలును
ఇంద్రియంబులు పదియు చిత్తేంద్రియంబు. 5

ద్వేషరాగముల్ సుఖదుంఖ ధృతులు మఱియు
చేతనత్వము కలిసిన క్షేత్రమగును
ఇంతదనుకను నుడివిన దంతవిజయ !
సంగ్రహంబుగ క్షేత్రపు చరిత యగును. 6

దురభిమానము లేకుంట దోషరహిత
శాంత్యహింసలు నార్జవ సహనములును
శౌచమును గురుసేవ నిశ్చలమనంబు
విషయసుఖముల యందలి విముఖతయును. 7

అహము లేకుండ నెంతయు నణగియుంట
జన్మ మృత్యువు దుఃఖము జరయు వ్యాధి
కల్గుటకు కారణ మరయు గలుగు నేర్పు
పుత్త్రదారాదులన్ రక్తి వొందకుంట. 8

సదనమందును మోహ మాసక్తి గొనక
ప్రియము నప్రియము తనను పెనగువేళ
సంచలింపక రెండిటి సమత గనుట
అన్య మెరుగక నాయం దనన్యభక్తి 9

శాంతచిత్తము మరియు నేకాంతవసత
లౌకిక జనవాసము నందలౌల్య బుద్ధి
ఆత్మ తత్త్వము తెలియ నత్యంతనిష్ఠ
తత్త్వదర్శన మొనరింప దగులుబుద్ధి
అన్ని కల్గుట జ్ఞానపు టవధియగును
తక్కి యుండిన నజ్ఞాన తత్త్వమగును. 10

దేన నమృతత్వ మబ్బును తెలిసినంత
తెలియదగు దాని గూర్చియు తెలిపెదింక
బ్రహ్మమున కాది యనునది పార్థ!లేదు
సత్యమును గాదు మరి గాదసత్యమదియు. 11

అన్ని యెడలను పాదముల్ హస్తములును
అక్షి శిరములు ముఖములో నన్ని యెడల
నన్ని యెడలను చెవులుండి యాలకించు
నన్ని యెడలను తానయై యావరించు. 12

ఇంద్రియ రహితమైన సర్వేంద్రియముల
వ్యాపకము లందు నదియెంతో వ్యక్తమగును
బంధ మెరుగదు కొను భూతభరణములను
గుణరహితమైన నదియుండు గుణములందు. 13

అదియు భూతములకు బహిరంతరములు
చరము గాదది మరియు నచరము గాదు
చూడబడదది యెంతయు సూక్ష్మమగుట
నదియు దూరము నంతిక మందుగలదు. 14

జ్ఞేయ మగునిది యవిభక్త స్థితినికల్గు
వ్యక్తమగు జీవులందు విభక్తమగుచు
భూతసృష్టికి స్థితికిని భూతనాశ
మునకు జ్ఞేయమగు నిదియె మూలమగును. 15

జ్యోతు లన్నిట మిన్నయౌ జ్యోతి యగును
అంధకారంబు కావల నలరునిది యు
జ్ఞానరూపంబు జ్ఞేయమ్ము జ్ఞానగమ్య
మదియు సర్వుల మనముల నధివసించు. 16

జ్ఞేయమును జ్ఞానమును మఱి క్షేత్రగతియు
సంగ్రహంబుగ తెలిపితి సంజ్ఞసంజ్ఞ
పార్థ! యివియన్ని తెలిసిన భక్తజనుడు
చిత్తశుద్ధితో నాదగు స్థితిని పొందు. 17

ప్రకృతిపురుషుల నిర్వరన్ పార్థ! తెలియు
నాశమొందక యుందు రనాదులనుచు
త్రిగుణములు వాని రాగముల్ ద్వేషములును
సర్వమ నగుచుండు ప్రకృతి సంభవములు. 18

కార్య కర్తృత్వ హేతువున్ కారణమును
ప్రకృతి తానయ్యె పరగును పాండుతనయ!
కర్తృ కారణ ప్రాకృత కార్యములకు
భోక్తృ హేతువు తానగు పురుష డెపుడు. 19

పురుష డుండును ప్రకృతిలో స్థిరతగల్గి
ప్రకృతి గుణముల నాతడు బడయుచుండు
గుణము లందలి యాసక్తి కొనలుసాగి
పుణ్య పాపపు జన్మలు పొందజేయు. 20

తానె సాక్షియగు ననుమోదకుడు తానె
తానె భర్తయు భోక్తయు తానె యౌను
అతడె పరమాత్మ యీశుండు ననుచు తెలియు
ప్రకృతి దేహము నందలి పరమపురుష. 21

ప్రకృతిపురుషులన్ వారల పరమగుణము
తెలియు చుండిన శ్రేష్ఠుడౌ దేహియెప్పుడు
వ్యవహరించిన లోకపు వర్తనముల
జనన మెడలిన పిమ్మట జన్మగొనుడు. 22

ధ్యానయోగము చేత కొందరిల నంత
రాత్మలందె జూతురు పరమాత్మ నెపుడు
జ్ఞానయోగము మఱియు నిష్కామ కర్మ
యోగముల రెంటఁ గొందురీ యోగసిద్ధి! 23

ఆత్మ విజ్ఞాన మిసుమంత యాత్మ జేరు
మార్గ మెఱుగని వాడయ్యు మానవుండు
కర్మ మొనరించు వినుకలి కలిమి జేసి
యట్టి వాడును మోక్షము నందగలడు. 24

చరము, నచరము నైన యీ జగతియందు
జీవి యేదైన నెంతటి చిన్నదైన
ప్రకృతి పురుషుల సంయోగ భణితివలన
జనన మందును తెలియుము సవ్యసాచి 25

సర్వ భూతము లందును సమత గల్గి
ఆత్మ నుండెడు నా పరమాత్మ యెపుడు
నాశరహితుడు దేహము నాశమైన
ననుచు తెలిసిన మానవు డౌను జ్ఞాని. 26

సర్వ జీవుల యందును సమత నిలచు
దివ్యుడగు నీశ్వరుని సమదృష్టి గనెడు
జనుడు హింసించు కొనడాత్మ జనును వాడు
పరమమై వెల్గు ముక్తికి వరమునందు. 27

కర్మ లొనరింప నెవడు ను కర్త గాడు
ప్రకృతిచేతనె కర్మలు పరగుచుండు
తన నకర్తగ నెప్పుడు తలచునరుడు
జ్ఞాన యగును వాడాత్మ విజ్ఞాని యౌను. 28

వేరువేరుగ నున్న యీ విపుల జగతి
యంత నొకటిగ నా పరమాత్మయందె
యున్న దంచును విస్తార మొందు నంచు
చూచు మనుజుడు బ్రహ్మము జొచ్చుచుండు. 29

ఆది యంతము లేని వాడగుట వలన
నర్జున! యంతడు నిర్గుణుం డగుటవలన
నవ్యయుండగు నా పరమాత్మ దేహ
మందు నుండియు కర్మల నంటబడడు. 30

అన్ని యెడలను వ్యాపించు నాకసంబు
మలిన పడకుండు కడుసూక్ష్మ మగుటనెట్లు
నిఖిల దేహము లందట్లు నెలకొనియును
నంటబడకుండు దేనిచే నాత్మయెపుడు. 31

జగతి నంతయు నొకడగు సవిత యెట్లు
తేజరిల జేయు తనదగు దీప్తి చేత
నవ్య యుండగు నా పరమాత్మ యట్లె
క్షేత్రములనెల్ల వెలిగింప జేయుచుండు, 32

క్షేత్రగతియు క్షేత్రజ్ఞుని చిత్రగతియు
ప్రకృతి మోక్షము నందు నుపాయములను
జ్ఞానదృష్టితో తెలిసెడు జనుడు తాను
పరమపదమును పొందును పార్థ! నిజము 33

ఇది శ్రీరామచంద్ర కరుణా కటాక్షలబ్ధకవితాచిత్ర, భారద్వాజసగోత్ర, బృందావనా న్వయసంజాత, నారాయణాచార్య పౌత్ర, కృష్ణమాచార్యపుత్ర, బుధజనవిధేయ, రామకృష్ణమాచార్య ప్రణీతంబైన ఉపనిషత్సారమును, బ్రహ్మవిద్యయు యోగశాస్త్రమును, కృష్ణార్జున సంవాదరూపమునునగు శ్రీభగద్గీతయందు క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగమను పదమూడవ అధ్యాయమునకు ఆంధ్ర పద్యానువాదము.

—0—

# శ్రీ భగవద్గీత

## 14 వ అధ్యాయము

## గుణత్రయ విభాగ యోగము

భగవానుడు పలుకుచున్నాడు:-

మరల నుడువుచు నుంటిని మతిని గొనుము
జ్ఞానముల కెల్ల నుత్తమ జ్ఞానమిపుడు
దీని నెరిగిన కతననె దివ్యులగుచు
మునులు సర్వులు నరిగిరి మోక్షమునకు. 1

ఇట్టి జ్ఞానము తా నాశ్రయించి యెపుడు
మత్సమాన మౌ స్థితినంది మానవుండు
జనన మందక యుండును సర్గమందు
నాశ మందడు సృష్టి వినాశమందు. 2

ప్రకృతి యంతయు యోనియై పరగునాకు
యోగమాయచే నే నాత్మయోని యందు
గర్భధారణ హేతువు గలుగుజేతు
సర్వ జీవులు దానన సంభవించు. 3

సర్వయోనులన్ కాంతేయ! సంభవించి
దేహ భావము నొందెడు దేహులకును
మాతృ పీఠమగు ప్రకృతి మాయ యెపుడు
బీజ కారణుడగు నేనె పితురుడగుదు. 4

సత్త్వ రాజస తామస తత్త్వగణము
అవ్యయంబగు నాత్మము నంటగట్టు
ప్రాకృతంబగు తనువున పాండుపుత్ర!
ప్రకృతి సంభవ మగుచుండు పార్థ!యవియు 5

సర్వ గుణముల నమలము సాత్త్వికంబు
కాంతి నిరుపద్రవంబుల గల్గియుండు
జ్ఞాన సుఖ సంగములచేత నాత్మనెపుడు
బద్ధ, మొనరించు చుండును పార్థ!తెలియు! 6

రజము రాగము అందునురాగ మందు
కలుగు జేయు నదియ మమకార మాశ
కర్మ సంగము చేతనె కడగి లెస్స
బద్ధ మొనరించు జీవుని పార్థ!యదియె 7

దాపురించు నజ్ఞత చేత తామసంబు
భ్రమను కలిగించు చుండును ప్రాణులందు
నిద్ర యలసత మఱపు లన్నింటిచేత
బద్ధ మొనరించు జీవుని పాండుపుత్ర! 8

సత్త్వ మనునది సుఖములన్ సక్తి గొలుపు
రాజసంబది కర్మలన్ రక్తి గొలుపు
జ్ఞానముచు గప్పియుంచును గాన తమము
మఱపు గలిగించు చుండును మానవునకు. 9

రజము తమముల సత్త్వము; రాజసంబు
తమము సత్త్వములను; మరి తామసంబు
సత్త్వ రజముల మిగులుచు సత్త్వమందు
నొకటి పెరుగుచు నణచును ఒరులరెంటి. 10

జ్ఞాన తేజంబు లభివృద్ధి నంది యెపుడు
దేహమార్గంబులన్నిట దేజ మెడలు
నపుడు సత్త్వము కడువృద్ధి యయ్యెననుచు
తెలిసి కొనవలె తత్త్వంబు తెలియుపార్థ! 11

లోభగుణమును కర్మలన్ లోలతయును
కర్మ లొనరింప బూనుట కడు నశాంతి
భోగలాలస యర్జున;పుడమియందు
జనుల కగుచుండు రజమది సత్త్వ మొంద. 12

కాంతిహీనత యలసత కర్మలందు
జాగ్రతయు లేమి మరియు నజ్ఞానగుణము
బుద్ధిమాంద్యము కలుగును పురుషునందు
తామసం బభివృద్ధి యౌ తరుణమందు. 13

సత్త్వ మభివృద్ధి చెందిన సమయమందు
మరణ మందిన యట్టి యా మానవుండు
ఉత్తమంబును, విజ్ఞాను లొందునట్టి
పుణ్య లోకంబులను తాను పొందుచుండు. 14

మరణమందిన రజమున మానవుండు
కర్మసంగుల గర్భాన గలుగుచుండు
మరణమందిన తమమున మానవుండు
మూఢయోనుల యందు తా బుట్టుచుండు. 15

సత్త్వ సంబంధ మైనట్టి సాత్త్వికమగు
సుకృతముల కెల్ల నిర్మల సుఖము ఫలము
దుష్ట రజమున ఫలితము దుఃఖమగును
జగతి తమమునకు ఫల మజ్ఞాన మగును. 16

సత్త్వగుణమున కలుగును జ్ఞానమెపుడు
రాజసంబున కలుగు దురాశ యెపుడు
దాపురించు నజ్ఞానము తామసమున
నలసతయు మోహగుణమును కలుగుదాన. 17

ఊర్ధ్వ గతులను సాత్త్వికు లొందుచుంద్రు
మధ్యమంబుగ నిలుతురీ మనజజగతి
రాజసగుణులు; నీచ వర్తనము గల్గు
నట్టి తామసు లరుగుదు రథమగతికి, 18

ప్రకృతి గుణముల కంటెను పరమమైన
కర్త వేరొండు గలుగడు కర్మచేయ
నిర్గుణుండగు పరమాత్మ నిత్య మెరుగు
జనుడు నారూప మందును సంతతంబు. 19

దేహసంభవ కారణ త్రిగుణముల క
తీతు డగుచుండు నిర్మల దేహియెపుడు
జన్మ మృత్యువు దుఃఖము జరయు వీడి
పరమపదమగు మోక్షంబు వడయగలడు. 20

అర్జునుడనుచున్నాడు;–

త్రిగుణముల కతీతుండగు దేహి యొక్క
నడత లెటులుండు ? గుణముల నడకలేవి?
మానవుడు వీని విడువంగ మార్గమేది?
దేవ! వివరించి చెప్పుమా దీనపాల! 21

సంప్రవృత్తంబులగు ప్రకాశమును గాని
రాజస ప్రవృత్తిని తమ భ్రాంతినైన
నెవడు ద్వేషింపకుండు నే యెడలనైన
కోరకుండు నివృత్తుమౌ గుణగణంబు. 22

సాక్షిభూతుడై దృఢ మానసంబుగల్గి
ప్రకృతిగుణములు తమతమ భావవశత
కడగి వర్తించు నంచు నెవడు తలంచి
సంచలింపక తాను నిశ్చలత నుండు. 23

సుఖము దుఃఖము నొకటిగ జూచునెవడు
సమత నుండు లోష్టాశ్మ కాంచనములందు
తుల్యుడై యుండు నిందలన్ స్తుతులయందు
ప్రియము నప్రియముల రెంటి వేరుగనడు. 24

మాన మవమానములను సమాన మనుచు
శత్రులందును మిత్రులన్ సమతగల్గి
సర్వ కర్మల నెవడిల సన్న్యసించు
నతడె త్రిగుణంబుల కతీతు డనగబరగు. 25

పార్థ! యిల నచంచలమగు భక్తి చేత
నిత్యుడగు నన్ను సేవించు నిరత మెవడు
త్రిగుణముల నవలీల నతిక్రమించి
బ్రహ్మపదమున కర్హుడౌ పార్థ! వాడు. 26

శాశ్వతంబగు ధర్మము సంతసమును
అవ్యయుండును; శాశ్వతు డమరు డైన
అవ్యయుండును శాశ్వతు డై నయట్టి
బ్రహ్మ కాధార భూతుడన్ పార్థ! నేనె 27

ఇది శ్రీరామచంద్ర కరుణా కటాక్షలబ్ధకవితావిచిత్ర, భారద్వాజసగోత్ర, బృందావనా న్వయసంజాత, నారాయణాచార్య పౌత్ర, కృష్ణమాచార్యపుత్ర, బుధజనవిధేయ, రామకృష్ణమాచార్య ప్రణీతంబైన ఉపనిషత్సారమును, బ్రహ్మవిద్యయు యోగశాస్త్రమును, కృష్ణార్జున సంవాదరూపమునునగు శ్రీభగద్గీతయందు గుణత్రయ విభాగయోగమను పదునాల్గవ అధ్యాయమునకు ఆంధ్ర పద్యానువాదము.

—0—

# శ్రీ భగవద్గీత

## 15 వ అధ్యాయము

## పురుషోత్తమ ప్రాప్తి యోగము

భగవానుడు పలుకుచున్నాడు:-

వేరు లూర్ధ్వము సంసార వృక్షమునకు
శాఖలధమును ఛందము లాకులగును
అక్షరంబగు సంసార వృక్షమనెడు
విషయ మెఱిగిన వాడగు వేదవిదుడు. 1

దీని శాఖలు పైకి క్రిందికిని గలవు
ప్రకృతి గుణముల వృద్ధిని బడయు నవియు
విషయ సుఖములు చివురులు వీటి కగును
దీని మూలము క్రిందికి తిరిగి పుడమి
పాదుకొను నిరవుగ కర్మ బద్ధమగుచు. 2

విశదపడదేరి కశ్వత్థ వృక్షమెపుడు
ఆది యంతము స్థిరతయు నసలెలేవు
వేరు బలమగు సంసార వృక్షమునకు
సంగ రాహిత్య మనియెడు శస్త్రధార
దీని ఛేదించి పూర్తిగ ధీరబుద్ధి! 3

ఎచట జేరిన మరలనీ యిహము లేదో
అట్టి పదమును నిరతము నరయు దగును
భూతజాలము లెందుండి పుట్టుచుండు
నట్టి పురుషునకు శరణ మనగవలయు. 4

కర్మసంగముల్ మఱియును కామములను
మోహ మానములను ద్వంద్వములను వీడి
విజ్ఞు లెపుడును నధ్యాత్మ విదులు నగుచు
పరమపదమగు మోక్షంబు బడయగలరు. 5

పరమమైనది నా దివ్య పదముపార్థ!
భానుమంతుడు చంద్రుడు పావకుడును
తేజ మొనరింప జాలరా దివ్యపదము
దీని జేరిన మనుజుడు తిరిగిరాడు. 6

ఆదినుండియు నాదగు యంశయొకటి
జీవలోకము నందున జీవమంది
చిత్త సహితము జ్ఞాన పంచేంద్రియముల
పార్థ ! యాకర్షణము జేయు పరమశక్తి 7

గంధ పుష్పాది వస్తువు లందుజేరి
వాసనలు పొంది చనియెడు వాయువట్లు
దేహ మందుచు విడచుచు దేహియెపుడు
గుణము లన్నిటి తనతోడ గొనుచుపోవు. 8

చక్షులందును రసనము చర్మమందు
నాత్మ శ్రోత్రము ఘ్రాణము నాశ్రయించి
శబ్దమాదిగ గల్గు విషయము లెల్ల
ననుభవించుచు నుండు జీవాత్మ యెపుడు. 9

ఆత్మయోగులు దర్శింతు రాత్మయందె
యత్నవశమున నా పరమాత్మ నెపుడు
జ్ఞానహీనులు దర్శింప జాలరట్లు
యత్నమెంతగ జేసియు నాత్మ నెపుడు. 10

ఉత్క్రమించుచు నెలకొని యుండువాని
విషయసుఖముల గొనుచును వెలుగువాని
నాత్మ గుణముల వర్తించు నాత్మ నెపుడు
జ్ఞాను లెఱుగుదు రెఱుగ రజ్ఞానులెవరు ? 11

జగము లన్నిటి వెలిగింప జాలినట్టి
భానుమంతుని భాసుర భాస్వరమును
చంద్రకాంతియు పావకు చండదీప్తి
అన్ని కాంతులు నాయవి యనుచు నెఱుగు. 12

పుడమి గర్భము జేరుచు బొలుపు మిగుల
ప్రాణికోటుల భరియింతు పరమశక్తి
సర్వ రసభావ భరితుడౌ చంద్రుడగుచు
నోషధుల వృద్ధి బొందించు చుందునేను. 13

అగ్ను లన్నిట వైశ్వానరాగ్ని నగుచు
నన్ని జీవుల దేహంబు లాశ్రయించి
ప్రాణమా నపాన వాయుల ప్రక్కజేరి
నాల్గు విధముల బోనము నారగింతు. 14

ఉందు సర్వుల హృదయము అందు నేను
నా వలన కల్గు స్మృతియును జ్ఞానములును
వేద వేదాంగముల చేత వేద్యుడేన
వేదకర్తను నేనయె వేదవిదుడ. 15

నరుడ ! తెలియుము క్షరుడు నక్షరు డనంగ
పురుషు లిర్వురు గలరిట పుడమియందు
సర్వజీవుల దేహముల్ క్షరుడనబడు
సర్వ కూటస్థ పురుషు డక్షరుడు పార్థ ! 16

వీరి కంటెను పురుషుడు పేరుగలడు
అతని నుడువగనగు పరమాత్ముడనుచు
లోకముల జేరి భరియించు లోకములను
దివ్యపురుషుడు సర్వేశు డవ్యయుండు. 17

క్షరుని కంటెను శ్రేష్టత కల్గుకతన
చాల శ్రేష్టుడ నగుట నక్షరునికంటె
మనుజ లోకాన వేదవాఙ్మయము నందు
పార్థ ! పురుషోత్తముడ నంచు ప్రథిత కల్గె. 18

ఎవ్వ డజ్ఞానమును వీడి యెల్లవేళ
నేను పురుషోత్తముడ నంచు నెఱుగు; వాఁడు
సర్వవిదు డనంగ బరగు జగతి; వాఁడు
భజన జేయు నన్నేకాగ్ర భక్తితోడ. 19

అతి నిగూఢమైనట్టి యధ్యాత్మవిద్య
నెఱుక పరచితి ప్రీతితో నిపుడునీకు
దీని చక్కగ నెఱిగిన ధీరబుద్ధి
జగతి కృతకత్యు డగుసు సంశయము లేదు. 20

భగవానుఁడు పలుకుచున్నాడు:-

ఇది శ్రీరామచంద్ర కరుణా కటాక్షలబ్ధకవితాచిత్ర, భారద్వాజసగోత్ర, బృందావనా న్వయసంజాత, నారాయణాచార్య పౌత్ర,కృష్ణమాచార్యపుత్ర, బుధజనవిధేయ, రామకృష్ణమాచార్య ప్రణీతంబైన ఉపనిషత్సారమును, బ్రహ్మవిద్యయు యోగశాస్త్రమును, కృష్ణార్జున సంవాదరూపము నునగు శ్రీభగద్గీతయందు పురుషోత్తమప్రాప్తియోగము అనుపదునైదవ అధ్యాయమునకు ఆంధ్ర పద్యానువాదము.

# శ్రీ భగవద్గీత

## 16 వ అధ్యాయము

## దైవాసుర సంపద్విభాగయోగము

భగవానుఁడు పలుకుచున్నాఁడు:-

సత్త్వగుణ విశిష్టతయును జ్ఞాననిష్ఠ
అభయ మింద్రియనిగ్రహ మార్దవములు
తపము యజ్ఞము స్వాధ్యాయ దానములును
సత్యము నహింస త్యాగము శాంతములును. 1

తేజ మక్రోధ హ్రీ క్షమా ధృతులు శుచియు
మార్దవము భూతదయ యభిమానరహిత
పరమమగు నలోలగుణ మపైశునమును
చపలరహిత యద్రోహమున్ సంభవించు
దైవసంపదఁ బుట్టిన ధార్మికులకు 2

దర్పమును క్రోధ మభిమాన దంభములును
పార్థ ! యజ్ఞానమును మతి పరుసదనము
నాసురంబగు ప్రకృతిచే నవతరించు
వారికీ గుణములగు స్వాభావికముగ. 3

దైవసంపద మోక్షపు దారిజూపు
నాసురము బంధహేతుక మగును పార్థ !
దైవసంపద బుట్టితి ధరణి నీవు
చింతనొందకు పొందుము చిత్తశాంతి. 4

సృష్టి యిరు తెఱంగులగు నీ చిత్రజగతి
నాసురంబును దైవము లనుచు పార్థ !
దైవగుణముల వినిచితి దండిమగడ
ఆసురంబగు గుణముల నవధరింపు. 5

అసుర గుణముల జననము నందువారు
ఇహము పరముల మార్గము లెఱుఁగ లేరు
శౌచ మాచారమును లేవు శాంతి లేదు
సత్యమును శూన్య మాసురీ జనులయందు. 6

జగదసత్య మస్థిర మనీశ్వరము ననుచు
సృష్టి కామహేతు వగుచు స్త్రీపురుషుల
పరమ సంయోగమున గల్గె పరము కాదు
అనుచు నుడివెద రాసురీ జనులు పార్థ ! 7

నాస్తికంబగు భావంబు ననుసరించి
బుద్ధినాశులై యల్పపు బుద్ధులగుచు
క్రూరులు జగతి కహితులు కోరి జగతి
నంత మొందింప జననము నందుచుంద్రు. 8

కాంక్ష గల్గుచు నిరతము కామమందు
దంభ మభిమాన మదముల దగిలివారు
దుష్ట సిద్ధాంతముల యందు దృష్టి గలిగి
కడగి వర్తింతు రపవిత్ర కర్మలందు. 9

అపరమితముగ నామరణాంత మందు
విషయసుఖముల వాసన విడువలేక
పొందదగినది కామోప భోగమనుచు
నితర మికయేది లేదని నిశ్చయించి. 10

కామ రోష పరాయణుల్ కాలగతిని
కట్టువడుచు నాశాపాశ కలనజేసి
కామభోగము లందలి కాంక్షచేత
ధనము పొందగ జూతు రధర్మగతిని. 11

సంతరించితి నీనాడు చాలధనము
కోరికల రేపు తీరుచు కొనెదనేను
లెక్కలేనంత నావద్ద లెక్కగలదు
మఱల పొందెద రేపట మఱియు ధనము. 12

శత్రు డీనాడు నాచేత చంపబడియె
తక్కు వారల జంపుదు త్వరితగతిని
నేనె యీశుడ బలుడను నేనెభోగి
నేనె సిద్ధుడ సుఖుడను నేనెయౌదు. 13

ధనము గల్గితి వంశపు ఘనతగలదు
నాకు దీటైన వాడొక నరుడుగలఁడె ?
నేన చేతును యజ్ఞముల్ దానశతము
ననుచు నజ్ఞాన మోహితు లగుచువారు. 14

వివిధ చిత్త విభ్రాంతుల వివశు లగుచు
మోహ జాలము చేతను ముట్టబడుచు
కామభోగములందాశ కల్గి యెపుడు
పతితు లగుదుర్ఘు నరకాన పార్థ ! నిజము. 15

ఆత్మఁ దలచుచు తామెంతొ యధికులనుచు
మాన ధనముల నధికమౌ మదముగల్గి
విహిత విధిపూర్వకము గాక వివిధగతుల
పార్థ ! చేతురు క్రతువు దంభముల కొఱకు. 16

కల్గి కామరోషము లహంకార గుణము
బలము దర్పము పొందిన వాఁడు సతము
నాత్మ యందును సర్వ భూతాత్మలందు
నన్ను గాంచగ పరదూషణంబు జేయు. 17

ద్వేషభావము గొనుటకై దీక్షఖూని
క్రూరకర్మము లొనరించు క్రూరమతులఁ
జనన మరణము లొందుచు జగతి మనగ
నాసురంబగు జన్మల నందజేతు. 18

అవత రించుచు తామెపు డసురయోని
జన్మ జన్మకు నధికమౌ జడతఖూని
నన్ను బొందగ నేరక నరుడ ! మఱల
పొందుచుందురు నీచపు పుట్టువులను. 19

మోహమును క్రోధలోభముల్ మూడు దలప
ద్వారములగు నా నరకపు దారియందు
నాత్మనాశము నొందించు నవియె పార్థ !
వాని మూడిటి నెప్పుడు వలయువిడువ. 20

నాశ మొనరించు పై మూడు నరకములును
వీని మూడిటి నుండియు విడువబడిన
జనుడు స్వశ్రేయ మొనరంగ సల్పి తాను
పరమ పదమును పొందును పార్థ ! యెపుడు. 21

శాస్త్రవిధులను వదలుచు సతత మెవడు
కామవశమున వర్తింప గడగు వాఁడు
సిద్ధి పొందగ నేరడీ పృథ్వియందు
సుఖము బడయడు మోక్షమున్ చూడగొనడు. 22

కార్యకరణ విమూఢత కలిగినపుడు
శాస్త్రవాక్యము సరియగు సాధనంబు
శాస్త్ర విహితమౌ విధులందు సారమెఱిగి
తగిన కార్యము లొనరింప దగును భువిని. 23

ఇది శ్రీరామచంద్ర కరుణా కటాక్షలబ్ధకవితాచిత్ర, భారద్వాజసగోత్ర, బృందావనాన్వయసంజాత, నారాయణాచార్య పౌత్ర, కృష్ణమాచార్యపుత్ర, బుధజనవిధేయ, రామకృష్ణమాచార్య ప్రణీతంబైన ఉపనిషత్సారమును, బ్రహ్మవిద్యయు యోగశాస్త్రమును, కృష్ణార్జున సంవాదరూపమును నగు శ్రీభగద్గీతయందు దైవాసుర సంపద్విభాగయోగము అను పదునాఱవ అధ్యాయమునకు ఆంధ్ర పద్యానువాదము.

# శ్రీ భగవద్గీత

## 17 వ అధ్యాయము

## శ్రద్ధాత్రయ విభాగయోగము

అర్జునుఁడనుచున్నాడు;-

శాస్త్రవిధులను విడచియు శ్రద్ధగల్గి
పూజలొనరించు వారలు పొందునిష్ఠ
సత్త్వ రజముల మఱి తామసముల యందు
నేది యగుచుండు వివరింపు మిపుడు కృష్ణ! 1

భగవానుడు పలుకుచున్నాడు:-

త్రివిధ మగుచుండు శ్రద్ధలు దేహి కెపుడు
సత్త్వ రాజస తామస శ్రద్ధలనగ
సత్త్వముమబట్టి మనుజుని శ్రద్ధగలుగు
నెట్టిదగు శ్రద్ధ మనుజుఁడు నట్టివాడె. 2

దివ్య సాత్త్వికుల్ పూజింత్రు దేవగణము
రాజసులు భజింతురు యక్షరాక్షసులను
ప్రీతి పూజింత్రు తామసుల్ ప్రేతగణము
జనుని పద్ధతి తెలుపును శ్రద్ధయేదొ. 3

అహము దంభము బొందుచు నహరహంబు
కామరోషముల్ బలమును కలిగియుండి
శాస్త్ర విధులను పాటింప జాలకెపుడు
తపము తీవ్రత నొనరించు తపసి యెపుడు 4

పంచభూతము లింద్రియ పంచకముల
దేహమును మఱి లోనున్న దేహినన్ను
కృశత నొందించు మిక్కిలి క్లేశపఱచు
బుద్ధి చెఱుగుము రాక్షస బుద్ధి వాఁడు. 5

వివిధజీవుల కాహార విధులు గూడ
త్రివిధగుణముల కనువుగ త్రివిధమగును
యజ్ఞ తపముల దానము లందు గూడ
భేద ముండును తెలిపెద వినుము పార్థ! 6

బలము నారోగ్య సత్త్వ వివర్ధనములు
ప్రీతి సుఖముల నెప్పుడు పెంపుజేయు
నాయు వర్ధన జేయు నాహారమెపుడు
నిష్టమగుచుండు సత్త్వ విశిష్టులకును. 7

చేదుతీపులు లవణమున్ చేరియుండి
వేడి గలుగుచు మిక్కిలి వేడిచేయు
అధిక దుఃఖము కల్గు నాహారములను
రాగమందుచు భుజియించు రాజసుండు. 8

వండి యామము గడచుటన్ పాచిపట్టి
నీచమైనది రుచిలేక నిలువయున్న
దగుచు నుచ్చిష్టమైన యాహారములను
తామసుడు తాను భుజియింప దలచునెపుడు. 9

కుశల బుద్ధితో ఫలమును గోరకుండ
విహితమైనట్టి బహుశాస్త్ర విధులచేత
యజ్ఞ మొనరింప కర్తవ్య మనుచు జేయు
యజ్ఞ మెప్పుడు సాత్త్విక యజ్ఞమగును. 10

ఫలము గోరుచు తాను ఢంబముల కొఱకు
విహితమైనట్టి బహుశాస్త్ర విధులచేత
యజ్ఞ మొనరింప నేఁ దగుదంచు జేయు
యజ్ఞ మెప్పుడు రాజస యజ్ఞమగును. 11

విధివిధానములును మంత్ర నిగ్రహలు లేక
నన్నదానము దక్షిణ లసలులేక
శ్రద్ధ లేకుండఁ జేసెడు సవనకర్మ
తామసంబని తలచుము దానిపార్థ! 12

ద్విజుల, గురువుల, జ్ఞానుల, దేవగణము
నర్చజేయుట; శౌచము నార్జవమును
బ్రహ్మచర్య మహింసయు బడసియుంట
తపము శారీర మనిదాని తలపవలయు. 13

ఇతరుల మనము నొప్పింప కెపుడు, ప్రియము
సత్యము, హితముగా పల్కజనుట; మఱియు
వేదముల నభ్యసించుట, వివిధ మంత్ర
జపము వాఙ్మయ తపమన జనునుదాని. 14

సత్యనిష్ఠయు, మరియు ప్రసాదగుణము
నెమ్మదియును మౌనము నాత్మనిగ్రహంబు
భావసంశుద్ధి మొదలగు వాని గలుగు
తపము, మానస మనిదాని తలపవలయు. 15

ఫలముగోరక, నిశ్చల భావమంది
అమిత భక్తితో శ్రద్ధతో నాచరించు
కాయ, వాచిక, మానస కర్మలున్న
తపము సాత్త్విక మనుచును తలపవలయు. 16

మనుజ సత్కార, పూజల, మానములను
పొందవలెనని చేసెడు పురుష తపము
నిశ్చలము గాదు మఱియు ననిశ్చితంబు
నట్టి తపమిల రాజస మనగబరగు. 17

జనుడు మూఢభావమున నజ్ఞానవశత
జేసి పరనాశనము గోరి చేయుతపము
తామసంబని తెలియుము దానిపార్థ!
తపము లన్నిట నది నీచ తపముతలప. 18

దానఫలము గోరకయె దాతవ్య మనుచు
పుణ్యదేశము నందును పుణ్యకాల
మందు పాత్ర మెఱిగి జేయు మహితమైన
దానమది సాత్త్వికంబగు దానమగును. 19

కేవలము తాను ప్రత్యుప కృతిని గోరి
దానఫలమును గోరుచు దాతయెపుడు
చిత్త క్లేశము గొనుచును చేయునట్టి
దానమనునది రాజస దానమగును. 20

దేశమెరుగక, కాలంబు దిక్కుగనక
పాత్రమెఱుగక నవమాన భావములతొ
గౌరవము లేక నొసగెడు ఘనతగల్గు
దానమైనను తామస దానమగును 21

విదితమయ్యె "నోంతత్సతుల్" వేదమందు
వాని మూట నిర్దేశమౌ బ్రహ్మ పార్థ!
బ్రహ్మచేతనె యజ్ఞముల్ బ్రాహ్మణులును
వేదములుగూడ పూర్వమె విహితమయ్యె. 22

బ్రహ్మపరమగు 'ఓమను' పదము నెపుడు
మొదట నుడువుచు వేత్తలు ముక్తి కొఱకు
వివిధ యజ్ఞము లొనరింత్రు విహితవిధుల
దాన తపములు గావింత్రు దాని నుడివి. 23

మొదట నుడివి తత్పదమును ముక్తి కొఱకు
వివిధ యజ్ఞము లొనరింత్రు విహితవిధుల
దాన తపములు గావింత్రు దానినుడివి
కాంక్ష గొనకుండ నా మోక్ష కాంక్షులెపుడు. 24

జగతి నుడువంగ బడుచుండు 'సత్పదంబు'
సాధుభావము నందును సత్యమనగ
సాధుకార్యము లందును సత్పదమది
యుచ్చరింపగ బడుచుండు నుర్వియందు. 25

యజ్ఞతపముల దానము లందుగూడ
పరగుచుండును 'సత్తను' బ్రహ్మపదము
బ్రహ్మపరమగు కర్మలు పార్థ! సతము
'సత్త'ని పిలువబడుచుండు సహజముగను. 26

శ్రద్ధ లేకుండ జేసెడు సవనకర్మ
తపము; నశ్రద్ధ జేసెడు దానములును
పలుకబడు నసత్కర్మలు; పార్థ! యవియు
నిహము పరముల సుఖముల నివ్వలేవు. 27

ఇది శ్రీరామచంద్ర కరుణా కటాక్షలబ్ధకవితాచిత్ర, భారద్వాజసగోత్ర, బృందావనా న్వయసంజాత, నారాయణాచార్య పౌత్ర,కృష్ణమాచార్యపుత్ర, బుధజనవిధేయ, రామకృష్ణమాచార్య ప్రణీతంబైన ఉపనిషత్సారమును, బ్రహ్మవిద్యయు యోగశాస్త్రమును, కృష్ణార్జున సంవాదరూపమును నగు శ్రీభగద్గీతయందు శ్రద్ధాత్రయ విభాగయోగము అను పదునాఱవ అధ్యాయమునకు ఆంధ్ర పద్యానువాదము.

—0—

# శ్రీ భగవద్గీత

## 18 వ అధ్యాయము

## మోక్ష సన్యాసయోగము

అర్జునుఁడు పలుకుచున్నాఁడు:-

యదుకులతిలక! సన్న్యాస మనగ నేమొ
త్యాగమన నేమొ, వాని తత్త్వముల గూర్చి
తెలియ గోరెద, మరల నే తెలుపుమయ్య
కేశిరాక్షస సంహార! కృష్ణ! నాకు.

భగవానుఁడనుచున్నాఁడు:

కామ్యకారణ రూపమౌ కర్మలన్ని
విడుట సన్న్యాస మనుచుంద్రు విజ్ఞులెపుడు
కర్మవిదు లెపుడును సర్వకర్మఫలము
తలచి త్యజియింప గల్గుట త్యాగమంద్రు

కర్మలన్నియు దోషంబు గలిగియుంట
కర్మసన్న్యాస మొనరింప గడగుమంద్రు
తపము, యజ్ఞము దానముల్ తగదు విడువ
నంచు నుందురు కొందఱో యమిత తేజ! 3

త్యాగమనునది త్రివిధముల్ తలచ పార్థ!
త్యాగమును గూర్చి నా నిశ్చితమును వినుము
తపము దానము యజ్ఞముల్ తగును జేయ
విడువరాదని పరమ పవిత్రమగుట 4

నిశ్చితంబగు కర్తవ్యనిష్ఠ గొనుము
ఫలము గోరక వీడుచు బంధములను
దాన యజ్ఞాది కర్మముల్ తగును జేయ
నిదియె నిశ్చితంబగు మతమెపుడు నాకు 5

వేద శాస్త్రాదు లందును విహితమైన
నియత కర్మల వీడుట నీతిగాదు
జగతి నెవడైన కర్మల జ్ఞానవశత
త్యాగ మొసరింప తామస త్యాగమగును 6

కర్మలన్నియు నొనరింప కష్టమనుచు
దుఃఖమగునని భయమున దూరమైన
త్యాగమనునది రాజస త్యాగమగును
పడయ డిలవాడు సన్న్యాస ఫలమునెపు 7

వేద శాస్త్రాదు లందును విహితమైన
నియతకర్మల నొనరింప నీతియౌను
ఫలము గోరక వీడుచు బంధములను
దాని త్యజియింప సాత్త్విక త్యాగమగును 8

కుశల కర్మల నాసక్తి గొనడు తావ
కుశలములయందు ద్వేషము గొనకయుండు
సర్వ వేత్తయు విచ్ఛిన్న సంశయుండు
తత్త్వనిష్ఠుడు సాత్త్విక త్యాగియెపుడు. 9

సర్వకర్మల విడుటకు సాధ్యపడదు
దేహయాత్రను సాగించు దేహికెపుడు
కర్మలొనరించు చుండియే కర్మఫలము
త్యాగ మొనరించు వాడిల త్యాగియగును. 10

ప్రియమునున్ మిశ్రితంబు నప్రియములైన
కర్మఫలములు సన్న్యాసి కానియట్టి
జనుని జన్మాంతరము లందు సంక్రమించు
కర్మసన్న్యాసి కవిమూడు కలుగవెపుడు. 11

సర్వ కర్మలు చక్కగా సఫలమవగ
కారణము లైదు కౌంతేయః కలవు నిజము
సాంఖ్యశాస్త్రము నందవి సవివరముగ
విహితమైనవి తెలిపెద వినుమునీవు 12

కర్మ సాధన కనువగు కాయమొకటి;
కర్త; పలురీతులగు కర్మకరణములును;
వివిధకర్మలు చేష్టలు వివిధగతులు;
దైవమును గల్గు కర్మసాధనము నందు. 13

న్యాయ మన్యాయములు వేని నైనపూని
మనము, కాయము, వాక్కులన్ మానవుండు
చేయదలచిన కర్మలు చివరజేర
నైదు కారణ మగుచుండు నయ్య! పార్థ! 14

బుద్ధి సంస్కార రహితచే పురుషు డెవడు
కర్త తానంచు తలచును కర్మములకు
నాత్మ తత్త్వము నెఱుగని యధముఁ డతఁడు
కర్మతత్త్వము నెఱుఁగడు కర్త గాడు. 15

తాను కర్తను గానని దలచునెవడు
బుద్ధి యెవనిది కర్మల బట్టువడదు
సర్వజీవుల సమయించి జగతి;వాడు.
కాడు సంహర్త కర్మల గట్టువడడు. 16

జ్ఞాత, జ్ఞేయంబు మఱియును జ్ఞానమనెడు
మూడు, కర్మాచరణకగు మూలకములు
కర్మ కాధారములు మూడు కలవుపార్థ!
కర్మ, కరణము, మఱియును కర్తయనగ. 17

కర్త, జ్ఞానము, మఱియును కర్మములును
తెలియు; గుణభేదముల చేత త్రివిధమగును
సాంఖ్యశాస్త్రము నందివి చాటబడియె
వివరణము జేతు స్థిరముగ వినుము విజయ! 18

విభజనంబైన ప్రకృతిలో వేఱు వేఱు
జీవజాలము లందున్న జీవియెపుడు
నవ్యయుండును, నొక్కడె యంచునెఱుగు
జ్ఞాన మనునది సాత్త్విక జ్ఞానమగును. 19
విభజనము పొందు ప్రకృతిలో వివిధమైన
జీవజాలము లందలి జీవుఁడెపుడు
వేరు వేరని తలచెడు విజ్ఞతేది?
జ్ఞాన మట్టిది రాజస జ్ఞానమగును. 20

ఏకకార్యము నందన్ని యిమిడియుండె
ననుచు హేతురహితమగు నట్టివాని
యందు నాసక్తి కలిగించు, యల్పమైన
తత్త్వమెఱుగని జ్ఞానము తామసంబు. 21

సంగములవీడి, ద్వంద్వముల్ సరకుగొనక
కర్మఫలముల బొందగ కాంక్షలేక
మానమును వీడి నియమితమైన యట్లు
కర్మమును జేయ సాత్త్విక కర్మయగును. 22

కర్మఫలముల బొందగ కాంక్షగొనుచు
కర్త నేనని తా నహంకారియగుచు
నధికమైనట్టి దేహ ప్రయాసపడుచు
చేయుకర్మ, రాజసమని చెప్పదగును. 23

తనకు హాని కలుగునని తలచకుండ
హింస యగునంచు బుద్ధి నూహించకుండ
భ్రాంతి గొనుచును మిక్కిలి పౌరుషమున
కడగి చేయుట తామస కర్మమగును. 24

కర్మసంగుడు మఱి యహంకారిగాక
ధృతి యుతుండు నుత్సాహియై ధీరబుద్ధి
సిద్ధుల నసిద్ధులను సమచిత్తుడైన
కర్త యెపుడును సాత్త్విక కర్తయగును. 25

కర్మఫలకాంక్షి, రాగము గలుగువాడు
హర్ష శోకాన్వితుడు లోభి యయినవాడు
శౌచమును లేక మఱియు హింసాత్ముడైన
కర్త యనబడు రాజస కర్తయనగ. 26

నియమహీనత స్తబ్ధత నీతిరహిత
కపట, మలసత, చింతయు కాలహరణ
పరహితము నాశమొనరించు పాపబుద్ధి
కలుగు వాఁడిల తామస కర్తయగును. 27

బుద్ధులను మూడు గుణముల భేదముననుదృ
దృతియు మూడగు గుణములతీరుఋట్టి
వేరు, వేరుగ వానిని విశదపరతు
నవధరింపుము కౌంతేయ! యమలచరిత. 28

మహితమౌ కర్మసన్న్యాస మార్గములను
బంధమోక్షముల్ భయము నిర్భయములను
కార్యము నకార్యములను చక్కంగ నెఱుగు
బుద్ధియేదది సాత్త్వికబుద్ధి యగును. 29

ధర్మములగాని మఱియు నధర్మములచు
కార్యములగాని మఱియు నకార్యములను
విధియుతముగాక సందిగ్ధ విదితగొనెడు.
బుద్ధి యేదది రాజస బుద్ధి యగును 30

ధర్మమగుదాని నెంతొ యధర్మమనుచు
ధర్మరహితము నదియెంతొ ధర్మమనుచు
విషయములనన్ని విపరీత విధిగదలచు
బుద్ధి యేదది తామస బుద్ధియగును. 31

ప్రాణ చిత్తేంద్రియముల వ్యాపారములను
యోగసాధన చేత నియుక్త పఱచి
చలన మెఱుగక నెపుడు నిశ్చలతనుంచు
ధైర్య మేదది సాత్త్విక ధైర్యమగును. 32

తెలియు మర్జున! ధైర్యము దేనిచేత
ఫలము గోరుచు, నాసక్తి బలముగాగ
ధర్మ మర్థకామములందు దగులముగొను
నట్టి ధైర్యము రాజస మనగబరగు. 33

భయము, దుఃఖము, దిగులును పరమనిద్ర
మదములను కల్గి దుష్టుడౌ మనుజు డెపుడు
ధారణము జేయు తా నెట్టి ధీరబుద్ధి
నట్టి ధైర్యము తామస మనగవచ్చు. 34

మనుజు డభ్యాసమున జేసి మహితసుఖము
దుఃఖనాశము బొందంగ ద్రోవజూపు
సుఖములును మూడు విధములు శూరశీలక!
వినుము వివరింతు నిపుడునే విజయ! నీకు. 35

ఏయది మొదట విషతుల్య మేదితుదకు
పరమ మమృతోప మానమై పరిఢవిల్లు
నాత్మ నైర్మల్యమున గల్గునట్టి సుఖము
సాత్త్వికంబని తెలియుము సవ్యసాచి! 36

ఇంద్రియ విషయ సంయోగ మేర్పడంగ
తొల్త నమృతోపమానమై తుదకు నేయ
దధిక విషతుల్య మగుచుండు నట్టిసుఖము
రాజసంబని తెలియు సంగ్రామశూర! 73

అలసతయు. నిద్ర, మఱపుల నంకురించి
యేయ దాద్యంతముల యందు నెపుడు తనకు
భ్రమను కల్గించు నట్టి యా పరమసుఖము
తామసంబని నుడువంగ దగును పార్థ! 38

ప్రకృతి జన్య త్రిగుణముల బట్టువడక
విడుపబడినట్టి సత్త్వము విజయ! లేదు
దివము నందును, ఘనులగు దివ్యులందు
లేదు; భూలోక మందును లేదులేదు. 39

బ్రాహ్మణులకును, క్షత్రియ వైశ్యులకును
శూద్రులకు, వారి గుణముల చొప్పుబట్టి
పార్థ! జన్మసంస్కార భావమును బట్టి
వారి కర్మలు విభజింప బడెను; వినుము. 40

శమము, దమమును, తవస్సును, శౌచగుణము
సహనగుణమును దైవ విశ్వాసములును
జ్ఞాన మార్దవ గుణము విజ్ఞానములును
బ్రాహ్మణునకు సహజములు పార్థ! నిజము. 41

కార్యదక్షత, ధృతియును, శౌర్యగుణము
దానశీలత, రణమున స్థైర్యగుణము
రాజరికమును, మఱియునున్ తేజమనగ
క్షత్రియునకు స్వాభావిక కర్మలగును. 42

వర్తకము; కృషి, గోరక్ష వైశ్యులకును
సేవ శూద్రునకు స్వభావ చేష్టలగును
స్వకుల కర్మల నభిరుచి సలుపువాడు
పరమ పదమగు మోక్షమున్ బడయగలడు, 43

భూతజాలము లెవనిచే పుట్టుచుండు
విశ్వమంతయు నెవనిచే వెలుగుచుండు
నట్టి విభుని స్వకర్మము నాశ్రయించి
పూజ లొనరించి మోక్షము పొందు నరుడు, 44

పరమ మైనట్టి పరధర్మ పరతకన్న
విహిత ధర్మము లవియెంత విగుణమైన
స్వకుల కర్మము లొనరింప చాలమేలు
పాప మంటదు దానిచే పార్థ! యెపుడు. 45

సహజ కర్మములవి దోషసహితమైన
విడువరాదవి విధిచేత విహితమగుట
నగ్ని పొగచేత నావృతమైన యట్లు
కర్మలన్నిటి దోషముల్ కప్పియుంచు. 46

విషయముల యందు నాసక్తి విడచియెవ్వ
డాశలను వీడి, తా విజితాత్ముడగుచు
సర్వకర్మల చక్కగా సన్న్యసించు
వాఁడు నైష్కర్మ్య సిద్ధిని బడయు పార్థ! 47

పార్థ! నైష్కర్మ్య సిద్ధిని బడసి నరుడు
జ్ఞాననిష్ఠకు పర్యవసాన మైన
పరమనౌ బ్రహ్మపదమును బడయు నట్టి
విధము తెలిపెద సంగ్రహ విధుల వినుము. 48

నిత్యనిర్మల మగుబుద్ధి నియతిగల్గి
నియమనిష్ఠల నాత్మను నియతపరచి
విడచిపేయుచు శబ్దాది విషయవాంఛ
ద్వంద్వభావము లేమిటి దలచకెపుడు. 49

పరిమితాహార మేకాంత వాసముగొని
త్రివిధ వాక్కాయ మనముల దిటవుపరచి
సతము ధ్యానయోగమున నాసక్తిగల్గి
యధిక నిష్ఠతో వైరాగ్య మాశ్రయించి. 50

వస్తు సంచయ, దర్పముల్, బలము లున్న
కామరోషముల్ మఱి యహంకారములను
మమత, విడచును; శాంతుడై మనుజుఁ డెవడు
బ్రహ్మసిద్ధికి నర్హతన్ బడయువాడు. 51

బ్రహ్మభావము బడసిన వాడు పార్థ!
కోరడిల దేని, దుఃఖమున్ గొనకయుండు
సర్వజీవుల యందును సమతనుండు
పరమ భక్తిని నాయందె బడయుచుండు. 52

ఎపడపై నది నాశక్తి యెట్టిదనుచు
తెలియ గలడిల మనుజుఁడు దివ్యభక్తి
నిక్కముగ నన్నెఱింగిన నీతిశాలి
నిశ్చయంబుగ ననుజేరు నిత్యభక్తి 53

అధికభక్తితొ పరము నన్నాశ్రయించి
సర్వకర్మల లొనరించు జనుఁడుగూడ
నా యనుగ్రహమున జేసి నాశరహిత
పరమపదము శాశ్వతముగ బడయుపార్థ! 54

మత్పరాయణుడ వగుచు మానసమున
సర్వకర్మలు నాయందె సన్న్యసించు
జ్ఞానయోగము స్థిరముగ నాశ్రయించి
మనము నాయందె నిల్పుము మరలకుండ. 55

చిత్త మెప్పుడు నాయందె జేర్చుకతన
కష్టముల నన్ని తరియింప గలవు పార్థ!
అటుల నా హితంబును వినవైతివేని
కలుగు నాశము నీ కహంకారవశత. 56

వశుడు వగుచును నీ వహంభావమునకు
నాహవము జేయ విముఖడ వైతివేని
మిథ్యయగు గాదె నీదగు నిశ్చయంబు
నియత మొనరించు ప్రకృతియె నిన్ను పార్థ! 57

ప్రకృతిభావము వలననె ప్రభవమైన
కర్మములచేత ఫల్గున! కట్టువడితి;
భ్రాంతిచే దేనిచేయవు పార్థ; దాని
ప్రకృతి నీచేత చేయించు బలముచేత. 58

సర్వభూతేశుఁ డీశుడు సర్వసాక్షి
జీవ హృద్దేశమందున జేరి నిలచి
జంత్రికల వోలె నీ జీవజాలములను
త్రిప్పచుండును తనదగు దివ్యమాయ. 59

అన్ని విధముల శరణగు మతనియందె
ఈశ్వరానుగ్రహముచేత శాశ్వతమును
పరమమైనట్టి పదమును బడయగలవు
పరమ శాంతియు గల్గును పార్థ! నీకు. 60

పరమ గుహ్యమీ జ్ఞానము పార్థ! దీని
నీకు నుపదేశ మిచ్చితి నింతవరకు
చిత్తమున దీనినిక విమర్శించి చూచి
చేయదలచితి వెద్దాని చేయుదాని. 61

గుహ్యతరమును పరమ మనూహ్యమైన
పలుకు చేకొను నుడివెద పార్థ! మరల
నాకు నత్యంత ప్రియుడవు నరుడ! నీవు
గాన నింతగ హితమును గరపుచుంటి. 62

నన్నె పూజించు, మనమున నన్నె నిల్పు
భక్తుడవు గమున్నాకు, నై ప్రణతులిడుము
నీవు నాయందె జేరెదు నిశ్చయముగ
శపథమును జేసి చెప్పెద సత్యమిదియ. 63

సర్వధర్మముల్ విడచుచు సాధుబుద్ధి
సవ్యసాచి! నన్నొక్కని శరణుగోరు
పాపములనుండి నిన్ను నే బాపగలను
భ్రాంతి నొందుచు చింతింప వలదుపార్థ! 64

భక్తి శుశ్రూష లెఱుగని వారలకును
మత్సరము చేత దూషించు మనుజునకును
తపము చేయని వానికి తగదునుడువ
నీకు నుడివిన యీగీత నెపుడు విజయ! 65

పరమ మైనట్టి యీవిద్య పార్థ! నాదు
భక్త జనులకు బోధించువాడు సతము
సంశయము వీడి భక్తి నిశ్చలత చేత
పుట్టు వికలేక పరమును పొందగలడు. 66

భక్తులకు గీత వినిపించు వానికంటె
ప్రీతి యొనరించు వాడిల వేరెలేడు
భక్తులకు గీత బోధించు వానికంటె
నిష్టుడిక లేడు రాడిక నితరుడెవడు. 67

భక్తితో మన ధర్మసంభాషణంబు
నధ్యయన మొనరించు వాడహరహంబు
జ్ఞాన యజ్ఞము చేత నీ జగతియందు
నన్ను పూజించు వాఁడగు నంచు దలతు. 68

శ్రద్ధ యనసూయ గల్గుచు జనుఁడెవండు
పుణ్య గీతను వినుచుండు పుడమియందు
పాపముక్తుడై వాఁడును, పరమమైన
పుణ్యకర్ముల లోకము పొందగలడు. 69

ఇంతవరకును గీతార్థ మంత పార్థ!
యేకమనమున వినియుంటివే గదయ్య!
చాపలంబున, నజ్ఞాన జనితమైన
మోహమది పూర్తిగా నాశమొంద లేదె? 70

అర్జునుఁడను చున్నాడు:-

దేవ! నీదగు దివ్యోపదేశమునవె
జ్ఞాన మొదవెను, నాకు నజ్ఞానమెడలె
స్థిరత గల్గెను, తొలగె సందియములన్ని
నీవు చెప్పిన విధముగ నేర్తు జేయ. 71

సంజయుఁడను చున్నాడు:-

అద్భుతంబును మఱి రోమహర్ష మొదవు
కృష్ణపార్థుల సంవాద గీతములను
వింటి నోరాజ! వీనుల విందుగొలువ
నితరు లెవ్వరు వినియుండ రిట్టిదాని. 72

యుద్ధమధ్యమున పరమయోగి యైన
వాసుదేవుఁడు స్వయముగ పార్థుకొఱకు
బోధచేసిన యతిగుహ్య పుణ్యగీత
వ్యాసు దయచేత వింటిని వాస్తవముగ. 73

కృష్ణపార్థుల సంవాద గీతములను
తలచు నపుడెల్ల పులకించు తనువు నాకు
విస్మయంబగు కృష్ణుని విశ్వరూపు
స్మరణ జేసిన కలుగును సంతసంబు. 74

పురమపురుషుడు కృష్ణుడు పార్థుగూడి
యెచ్చటెచ్చటి నుండును నచ్చటచట
సిరియు, సంపద, జయమును చేరుచుండు
నీతియును గల్గు నిదియె నా నిశ్చయంబు. 75

ఇది శ్రీరామచంద్ర కరుణా కటాక్షలబ్ధకవితాచిత్ర, భారద్వాజసగోత్ర, బృందావనా న్వయసంజాత, నారాయణాచార్య పౌత్ర,కృష్ణమాచార్యపుత్ర, బుధజనవిధేయ, రామకృష్ణమాచార్య ప్రణీతంబైన ఉపనిషత్సారమును, బ్రహ్మవిద్యయు యోగశాస్త్రమును, కృష్ణార్జున సంవాదరూపమును నగు శ్రీభగద్గీతయందు మోక్షసన్న్యాసయోగమను పదునెనిమిదవ అధ్యాయమునకు ఆంధ్ర పద్యానువాదము.



# భగవద్గీతా మాహాత్మ్యము

భూదేవియడుగుచున్నది:-

పరమపావన! పరమేశ! పరమపురుష!
అఖిలధారక! అచ్యుత! ఆదిదేవ!
అమలమగు భక్తి ప్రారబ్ధ మనుభవించు
జనుల కేరీతి కలుగును సారసాక్ష!

విష్ణుమూర్తి పలుకుచున్నాడు:-

అవని! ప్రారబ్ధకర్మము లనుభవించు
నరుఁడు సతము గీతాభ్యాస పరత కల్గి
కర్మబంధనములచేత కట్టువడక
ముక్తుడై యిహమున సుఖయుక్తుడగును.

పరమపావన గీతను భక్తి నెవడు
పఠన మొనరించు నిరతము; వానినెపుడు
నంటజాలవు దురితము లద్భుతముగ
జలము నలినీదళము నంటజాలనట్లు.

త యేచోట నుండును;గీత యెచట
పఠన మొనరింప బడుచుండు పరమభక్తి
ముక్తి నొసగు ప్రయాగయు మొదలుగాగ
తీర్థరాజములన్ని యేతెంచు నటకు,

సర్వదేవతలు భగవత్పార్శ్వచరులు
గోపగణమును, యోగులు, గోపికలును
నారదోద్ధవుల్, ఋషులును నాగములును
సాయపడుదురు గీతను చదువుచోట. 5

భక్తి నెచ్చట నీగీత పఠనమగును
పాఠనము జరుగు నెచట పరమభక్తి
నెచట గీతాశ్రవణముండు; నచటనచట
నిలచియుందును నిరతము నేనుదేవి! 6

ఆశ్రయించెద నీగీత ననిశమేను
గీతయే యగు నుత్తమ గృహమునాకు
జగములను మూటి పాలింతు జలజనేత్ర!
అతులమైన గీతాజ్ఞాన మాశ్రయించి. 7

పరమపావని! గీత నా బ్రహ్మవిద్య
బ్రహ్మరూపమౌ నది యనిర్వాచ్యమగును
అర్ధమాత్రయు; నిత్యము నక్షరమును
సందియము లేదు దీనికో యిందువదన! 8

వేదముల మూటి సారము; విపులమైన
తత్త్వగర్భిత మానందదాయి యైన
గీత నుపదేశ మిచ్చెను కృష్ణుడతివ!
సవ్యసాచికి స్వయముగ సమరమందు. 9

నిశ్చలంబగు మనమున నిత్యమెవడు
పదియునెన్మి దధ్యాయముల్ పఠనచేయు
జ్ఞానసిద్ధిని గాంచి సుజ్ఞాని యగుచు
పరమపదమును బొందును వాఁడుపిదప. 10

శక్తి లేకున్న పూర్తిగ జదువుకొరకు
నర్ధమైనను పఠియింప నగును జనుడు
దానిచేతను కలుగు గోదానఫలము
సందియము లేదు దీనికి సారసాక్షి!. 11

జనుఁడు మూడవభాగము జదివినంత
గంగమునిగిన ఫలమది కలుగు నిజము
భక్తి నాలవభాగము పఠన జేయ
సోమయాగపు ఫలమును చూరగొనును. 12

ఉర్వి! యెవడిల నధ్యాయ మొకటియైన
సంతతంబును భక్తితో జదువు; వాడు
రుద్రలోకము బొందును రుద్రగణము
జేరి సుఖముండు నచటనె చిరము దేవి! 13

వసుధ! యధ్యాయమున పాదభాగమైన
సతతమును భక్తితోడుత జదువునెవడు
వాఁడు మనుకాల మగునంత వరకు జగతి
మనుజజన్మము బొందును మరలమరల. 14

పదియునై నను, శ్లోకసప్తకమునైన
పంచకము నైన, నాల్గైన వరమభక్తి
శ్లోకములుమూడు; రెండొక శ్లోకమైన
సర్ధమైన; పాదమును; పాదార్ధమైన. 15

చదువు నెవడిల నిత్యము, జనుసు వాఁడు
ఇందువాసము; వసియించు సందుచిరము.
రక్తి పఠియించున్ శరీరమును విడచు
వాఁడు: దేవత్వమును పొందు వసుధ! నిజము. 16

మరలమరలను గీతను మననజేసి
ఉత్తమంబగు మోక్షము నొందునరుడు
అవని! తా నంత్యకాలము నందు గీత
నుచ్చరించిన సద్గతి నొందు జనుఁడు. 17

దురితముల నెన్ని జేసిన దుష్టుఁడైన
గుహ్య గీతార్ధముల విని గోరునేని
పరమపావన వైకుంఠ పదముజేరు
విపుల సంతోషమును బొందు విష్ణుగూడి. 18

నియతకర్మల చక్కగ నిర్వహించి
నిరతమును గీత పఠియించు నెవడు దేవి!
నుడువదగు వాని జీవనముక్తు డనుచు
దేహమును వీడి చేరును దివ్యపదము. 19

జనకు డాదిగ గల్గు రాజర్షు లంత
అమృతమయమగు నీగీత నా[శయించి
దురితములచేత నిహమున దూరులగుచు
పరమపదమును బొందిరి వరమునందు. 20

పరమగుహ్యమౌ గీతను పఠనజేసి
అద్భుతంబగు దీని మహాత్మ్యమెవడు
పఠన మొనరింప కుండును పరమభక్తి
వాని పఠనము వృథయగు; వసుధ!నిజము. 21

జనుఁడు గీతను మాహాత్మ్యసంయుతముగ
కరము భక్తి తొ పఠియింప గలిగెనేని
పైన నుడివిన ఫలితముల్ పడయగలడు
పరమ దుర్లభ మోక్షమున్ పడయగలడు. 22

సూతుఁడు చెప్పుచున్నాడు:-
అతి సనాతనంబగు నీమహాత్మ్యమేను
తెలిపెనాడను వివరముల్ తేటపడగ
జనుఁడు గీతాంత మందైన జదివి దీని
[పోక్తఫలముల నన్నింటిఁ బొందగలడు. 2

ఇది శ్రీవరాహపురాణమందు నుడువబడిన శ్రీ గీతామహాత్మ్యమునకు రామకృష్ణమాచార్య [పణీతంబైన యాంధ్రపద్యానువాదము.

ఓంతత్సత్.

# మంగళము

మంగళంబగు నలివేలు మంగపతికి
మంగళంబగు రావణ మర్దనునకు
మంగళంబగు సత్యభామా విభునకు
మంగళంబగు నిరతము మారుతికిని.

సర్వేజనాస్సుఖినోభవంతు.

ప్ర తు ల కుః-

బృందావనం రామకృష్ణమాచార్యులు

భాషాప్రవీణ

యస్. యస్. జి. హైస్కూలు.

వడ్డివారిపాలెం 522264.

రేపల్లె తాలూకా

గుంటూరు జిల్లా.